వీరరాఘువమూర్తి శాస్త్రి, దేవులపల్లి.

# అభినయ స్వయంబోధిని

కాకినాడ, 1915.

Record no.87

Vīrarāghavamūrti Śāstri,
Dēvulapalli.

Abhinaya svayambōdhini

Kākināḍa, 1915.

Record no.87

Bibliographic Record Target

వీరరాఘవమూర్తి శాస్త్రి, దేవులపల్లి.
అభినయ స్వయంబోధిని / దేవులపల్లి వీరరాఘవమూర్తి శాస్త్రి.- 1. కూర్పు.- కాకినాడ: శ్రీసరస్వతీ ముద్రాక్షరశాల, 1915.
xiv, 292, 3 P. ;20.5 cm.
Record no.87

Vīrarāghavamūrti Śāstri, Dēvulapalli.
Abhinaya svayambōdhini / Dēvulapalli Vīrarāghavamūrti śāstri.- 1. kūrpu.- Kākināḍa: Śrīsarasvatī Mudrākṣaraśāla, 1915.
xiv, 292, 3 p. :port. ;20.5 cm.
Record no.87

శ్రీరస్తు.

# అభినయ స్వయంబోధిని.

ఈగ్రంథము అభినయ విద్యార్థినీలు స్వయముగ నభ్యశించుట కుపయుక్త
ముగ నుండునట్లు గ్రంథాంతరముల యందలి నాయిక నాయక
రసభావాదులు మొదలగు బహువిషయములను జేర్చి
తెనుగు వచన రూపకమున సంగీత రసా
భినయ శాస్త్ర ప్రవీణులగు

వేములపల్లి వీరరాఘవమూర్తి శాస్త్రిచేతను రచియింపబడినది.

మొదటికూర్పు 1000 కాపీలు.

కాకినాడ:

శ్రీసరస్వతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడి
ప్రకటింపబడియెను.

1915.



[వెల రు 2-8-0.

# ప్రకటన

ఈగ్రంథము గవర్నమెంటువారి కాపీరైటుచట్టప్రకారం రిజిస్టరుచేయబడినదిగనుక నితరులెవ్వరును దీనిని ముద్రింపగూడదు అట్లుముద్రించినయెడల నష్టమునకు బాధ్యులగుదురని యిందుమూలముగా దెలియజేయుచున్నాను.

ఇట్లు గ్రంథకర్త,

దేవులపల్లి వీరరాఘవమూర్తిశాస్త్రి,

కిర్లంపూడి.

# పీఠిక.

ఆర్యులారా? అఖిలజన హృదయానందకరంబగునట్టియు, సకల సంపత్కరంబగునట్టియు, భుక్తిముక్తిఫలదంబగు అభినయశాస్త్రము; పూర్వకాలంబున, బ్రహ్మదేవునివలన సృష్టింపబడిన వేదములనుండి, అనగా, ఋగ్వేదమునుండి, వాద్యమును, యజుర్వేదమునుండి అభినయమును, సామవేదమునుండి గానమును, అథర్వణవేదమునుండి రసములను, సంగ్రహించి, యీశాస్త్రము జేయబడెను. తరువాత; శ్రీఉమామహేశ్వరులకృపచేతను తమసేవకాగ్రేసరులగు శ్రీనందికేశ్వరునకు యీశాస్త్ర ముపదేశింపబడినదై, వారివలన భరతార్ణవమనెడు విశేషగ్రంధము జేయంబడి ఇంద్రాదిదేవతల కీవిద్య నభ్యశింపబడిన విధంబెట్టిదనిన:—

యీశాస్త్రము; నాట్యమనిన్ని, నృత్తమనిన్ని, నృత్యమనిన్ని, మూఁడువిధములు; అందు:—

1. నాట్యమనగా; నాటకమునందు పూర్వకథతోడ వినియోగింప బడునది నాట్యము.

2. నృత్తమనగా; రసభావములచే తక్కువపడినదై తాళలయానుగుణ్యముగా నుండునది నృత్తమనబడును.

3. నృత్యమనగా; తాళలయానుగుణ్యమై రసభావములచే గూడియున్నది నృత్యమనబడును.

ఈనాట్య నృత్త నృత్యములు మూఁడునుగలసి మరల లాస్యమనియు, తాండవమనియు యిరుతెరగులైనవి. అందు:—

1. లాస్యమనగా, కూర్చుండి రాగ తాళ రస భావములచే నభినయించునది లాస్యము:—

2. తాండవమనగా; నిలచి తాళ లయానుగుణ్యముగా అభినయించునది తాండవము.

ఈనృత్త, నృత్యములు పర్వకాలములయందును, పట్టాభిషేక మహోత్సవములందును, తిరునాళ్ళు, ఊరేగింపు. దేవుని యూరేగింపు, పెండ్లి, నిత్యసభ, పురప్రవేశము, గృహప్రవేశము, ప్రత్యేకోత్సవము మొదలగు శుభకార్యములయందు తప్పక చూచుటచే,

సకలశ్రీయస్సంపత్కరంబును, అత్యానందమును, గలిగింపుటయేగాక, అట్టిమహోత్సవంబుల కొకభూషణంబుగ నలంకరింపజేయుదురని విన్నవించెదను :—

ఇట్టి అమితానందమును గలిగించునట్టి యీనాట్యము అనగా రస భావాదులతోఁగూడిన ఈఅభినయ శాస్త్రమును గురించి విశేషగ్రంథములు ప్రత్యేకము ముద్రితములై యుండనందునన్ను, ముద్రితములై యున్నంతవరకు గీర్వాణభాషలోనున్న భరతార్ణవమనెడు లక్షణగ్రంథమునుబట్టి జేయంబడిన భరతరసప్రకరణము, అభినయదర్పణము మొదలుగాగల స్వల్పగ్రంథములు లక్షణంబుగాముద్రితములైయున్నను, యీవిద్య, స్త్రీలచే నభ్యసింపవలసినదగుటచే స్త్రీలు అట్టి లక్షణగ్రంథములుచదివి గ్రహించగలనంత విద్యాసంపత్తి లేమింజేసిన్ని యీవిద్య నభ్యసించుటయందభిలాషగల వేశ్యస్త్రీలు మొదలగు ప్రతివారును సులభముగా గ్రహించుట కుపయుక్తంబయిన తెనుగుగ్రంథంబులు లక్ష్యంబుగ లేనందునన్ను, పురుషులలో నైనను యీశాస్త్రము నేర్చిన విద్వాంసులు విశేషముగా అనగా; తదితరశాస్త్రములందు ప్రావీణ్యత గలిగివున్నట్లు యీవిద్యలో లేనందునన్ను, స్త్రీ పురుషులలో గీర్వాణభాష తెలిసివుండిన్ని యీఅభినయశాస్త్ర ప్రావీణ్యత సంపాదించినవారు యెచ్చోటనైనా వేయికి నొకరుగా వుండీవుండడము చేతనున్ను, యీవిద్య నభ్యసించ నభిలాషగల స్త్రీలకు ద్రవ్యలేమి మొదలగు కారణంబులచే అట్టివిద్వాంసులను సందర్శము జేసుకొనుటకు తగిన సామర్థ్యంబు లేకపోవుటంజేసిన్ని, యీవిద్య బహుహీనదశకు వచ్చుచున్నదని సర్వజనులకు విదితమై యుండవచ్చును.

ఈవిద్య యింతగూఢములో నున్న కారణంబున, వర్తమానమందుయీఅభినయవిద్య కొంతవరకు నేర్చి కాలముగడుపుచున్న వేశ్యలు, తాము అభినయించుచున్న పదములు, పదవర్ణములు, మొదలగువాటియొక్క నాయిక, నాయకా రస భావాదులు వగయిరాలను గురించి శాస్త్రసమ్మతంబుగ యేమియు దెలుసుకొనజాలక చేతులు, కండ్లు, మొదలగు అవయవములు మాత్రము అనుభవలేమింజేసి, ఇటు, అటు, అజ్ఞానముచే త్రిప్పుచున్నంతమాత్రమున అభినయము నేర్చినామని సభలకెక్కి, అట్టిసభలయందొకానొకప్పుడు శాస్త్రసమ్మతంబైన ప్రశ్నలిడినప్పుడు, వెంటనే తగు నుత్తరువు లీయంజాలక అనాదరణయు, ఆక్షేపణయున్ను, బొందుటకు కారణంబగుచున్నదని అనుభవముచే దెలిసికొనదగియుండును. కావున హీనదశకువచ్చిన యీఅభినయవిద్య వృద్ధిబొందింప నుత్సహించి యీవిద్య నేర్చ గ్రహించ నభిలాషగల ప్రతి స్త్రీపురుషాదులకు ప్రత్యేకము గురువపేక్ష లేకుండునట్లుగ, సులభముగను, స్వయముగ నభ్యసించుట కుపయుక్తముగ నుం



డునట్లున్ను, సభలయందు శాస్త్రసమ్మతంబైన రసపుష్టిగాను, జంకులేకుండగ నభినయించునట్లున్ను, సభలయందొకానొకప్పుడు శాస్త్రసమ్మతంబైన ప్రశ్నలిడినప్పుడు వెంటనే తగు నుత్తరువులు చెప్పగల సామర్థ్యంబు గలుగునట్లున్ను, తగినమార్గము లెవ్వియని నాలో నేను సంకల్పించుకొని, శ్రీగోపాలకృష్ణ కరుణాకటాక్ష వీక్షణప్రసాదంబు వడసి, అనేక గ్రంథాంతరములనుండిఅభినయమునకు నత్యావశ్యకమయిన నాయికా నాయక రసభావాదులు మొదలగు బహువిషయములు లక్ష్యముజేస్తూ, వర్తమానమందు సాధారణముగ అందరును పాడుతూవుండి విశేషవాడుకలోనున్న పదములు, పదవర్ణములు, స్వరజతులు మొదలగునవి నూటికిపైగా లిఖించి, ఆయాపదములు వగైరా కీర్తనలకువొప్పే నాయిక, నాయకా రసభావాదులుఆయాకీర్తనల చరణములక్రిందనే అక్షరాభ్యాసమున్న ప్రతివారును సులభముగా గ్రహించునటుల స్పష్టముగ అభినయము వ్రాసి కనపర్చి తెనుగు వచన రూపకమైన "అభినయస్వయంబోధిని" అనునీగ్రంథము యీదిగువున కనపర్చిన విషయసూచికప్రకారం రెండుభాగములుగ సంగీత రసాభినయ శాస్త్రప్రవీణులెల్లరు చూచి ఆమోదించునట్లు నాచేరచియింపబడి శ్రీకృష్ణార్పణంబుగ సమర్పింపబడియెను. కావున గుణగ్రహణ పారీణధురీణులగు విద్వజ్జనులెంతయు నీరంబు త్యజించి క్షీరంబుగొను మరాళరాజంబుమాడ్కి గుణగ్రహణంబుగావించి నన్నానందింపజేయుదురని నెమ్మనంబున ధృవంబుగ నమ్మి ను శేలొక్కడిచి విద్వజ్జనులను ప్రార్థించుచున్నాడను.

ఇట్లు,

గ్రంథకర్త,

విద్వజ్జన విధేయుడు,

వేపులపల్లి వీరరాఘవమూర్తిశాస్త్రి,

కిర్లంపూడి, గోదావరిజిల్లా.



శ్రీరస్తు.

# ఉపోద్ఘాతము.

---

లోకమునందు, నాయికా, నాయకులకు, పరస్పరావలోకనాదికముచే, హృదయమందు సముత్పన్నంబగు రతి స్థాయియనబడును.

ఆస్థాయి, విభావ, అనుభావ, సాత్విక, వ్యభిచారి భావములచే, వ్యక్తీకృతమై, సామాజికులచే ఆస్వాదింపబడి, రసమగుచున్నది.

రసోత్పాదనకారణము విభావమనబడును. హృదయస్థితమైన రతిని, అభివ్యక్తము చేయుచున్న భ్రూవిక్షేప కటాక్షాదికము అనుభావమనంబడును. పరగత సుఖదుఃఖముల భావనచేనైన యంతఃకరణయొక్క తన్మయీభావము సత్వమనంబడును. అందుండి కలుగునవి సాత్వికములు రసోత్పత్తికి సహకారులు వ్యభిచారిభావములనంబడును. ఇవి సంచారులనియు చెప్పనగును.

విభావము:—ఆలంబనమనియు, ఉద్దీపనమనియు ద్వివిధము. ఆలంబనమనగా;—రత్యాదులకు విషయీభూతులైన నాయికా నాయకులు.

ఉద్దీపనమనగా, గుణచేష్టాలంకార తటస్థములు.

గుణములు=రూపయౌవన లావణ్యాదులు.

చేష్టలు=హావ భావాదులు, అవి 18.

అలంకారము=నూపురాంగదాదులు.

తటస్థములు=చంద్రోదయ, మలయమారుతకోకిలాలాపాదులు.

సాత్వికములు=అశ్రుస్వేదాదికము, అవి 8. చెమట, స్తంభితము, రోమాంచము, స్వరభంగము, కంపము, వివర్ణము, బాష్పము, ప్రళయము, అనిన్ని —

సంచారులు=స్థాయిపోషకములగు, నిర్వేదాదులు అవి 33.

యీనాలుగు విధములగు భావములచే రసికజనులను బొందెడు స్థాయీభావము రసత్వమును బొందుచున్నది.

రసమునకు ఆధారముగ చెప్పబడుచున్న నాయిక, స్వీయ, పరకీయ, సామాన్యయని మూడువిధములు. అందు.

## 1 స్వీయ.

పరిణీతయై పతియందుమాత్రము ప్రీతిగల పతివ్రత స్వీయ యనంబడును. దీనికి పతిశుశ్రూష శీలసంరక్షణము, ఆర్జవము, క్షమ, ఇవిచేష్టలు.

ఈస్వీయ మూడువిధములు గలదగును.

1. ముగ్ధ, మధ్య, ప్రౌఢయని, మూడువిధములు. అందు.

(1) ముగ్ధఅనగా, అంకురింపబడని యౌవనముగల కాంత ముగ్ధ.

(2) మధ్యఅనగా లజ్జయు, మదనోత్సాహంబును, సమానంబుగా, గలది మధ్య.

(3) ప్రౌఢయనగా, పతియందు రతికేళికోవిదయగునది ప్రౌఢ, యీమధ్యాప్రౌఢలు, కోపముదోచునెడ, ధీర, అధీర, ధీరాధీర, అని త్రివిధములగుదురు.

ఈధీరాది భేదంబులాఱును జ్యేష్ఠా కనిష్ఠాభేదంబులచే మరల ద్వివిధంబగు; జ్యేష్ఠ అనగా పతియందు అధికస్నేహముగలది. జ్యేష్ఠయును, కనిష్ఠ అనగా పతియందు స్వల్పస్నేహంబు గలది కనిష్ఠయనియును జెప్పంబడును.

## 2. పరకీయ.

పరపురుషునియందు అనురాగము ప్రకాశము చేయకుండునది పరకీయ యనంబరగు. అది పరోఢయని, కన్యయని ద్వివిధయగును. యీనాయికయందు గుప్త, విదగ్ధ, లక్షిత, కులట, అనుశయాన, ముదిత, సాహసిక ఇత్యాదిభేదంబు లంతర్భవించుచున్నవి.

1. గుప్తఅనగా=తనుచేసిన కార్యము దాపనేర్చినది గుప్తయగును.

2. పుంశ్చలీభావంబున సమర్థురాలు విదగ్ధయగును.

3. లక్షితఅనగా సఖ్యాదులచే తెలిసికొనబడిన జారసురతముగలది లక్షిత.

4. కులట అనగా జారసమూహమును బొందినది. కులట అనబడును.

5 అనుశయాన అనగా ఇష్టహానిచేతను, అనిష్టప్రాప్తిచేతను అనుతపించినది అనుశయాన అనదగును.

6. ముదితయనగా ఇష్టప్రాప్తిచే సంతోషించునది. ముదితయనదగును.

7. సాహసికఅనగా పతినివంచించునది. సాహసికయనదగును.

## 3. సామాన్య.

ద్రవ్యదానమాత్రము నిమిత్తముగా సకలపురుషులయందును అనురాగము గలది సామాన్య యనంబరగు.

ఈముగ్గురు నాయికలును ప్రత్యేకము ఉత్తమ, మధ్యమ, అధమ, భేదములచే త్రివిధములగుదురు.

1. ఉత్తమఅనగా ప్రియుడు అహితముచేసినను తానుహితముచేయునది. ఉత్తమ.

2. మధ్యమ అనగా హితాహితములకు తాను అట్లుచేయునది మధ్యమ.

3 అధమయనగా ప్రియునియందు అహితము సేసెనంచి కోపించునది అధమ.

ధీరాదిభేదంబులచేతను జ్యేష్ఠా, కనిష్ఠాభేదముచేతను అయినమధ్యాప్రగల్భలు పన్నిద్దఱును, ముగ్ధయుగూడ స్వీయయందు పదమువ్వురు, పరకీయయందు ఇద్దఱును, సామాన్యయుగూడ నాయికలు పదియాఱుగురైరి. ఈనాయికలకు ప్రత్యేకము అవస్థా భేదముచే ప్రోషిత భర్తృకాద్యష్ట భేదంబులు గణింపగా నూటయిరువది యెనిమిది భేదంబులయ్యెను. మరియు వానికి ఉత్తమ, మధ్యమాధమభేదంబులు గణింప మున్నూట యెనుబదినాలుగు భేదంబులయ్యె. ఇంతియకాక జాతిభేదంబుచే పరిగణించిన నాయికాభేదంబు లనంతములగును.

## అష్టవిధనాయికా లక్షణము.

1. ప్రోషితభర్తృక 2 ఖండిత 3 కలహాంతరిత 4 విప్రలబ్ధ 5. విరహోత్కంఠిత లేక ఉత్క 6. వాసకసజ్జిక 7. స్వాధీనపతిక 8. అభిసారికయనిన్ని అష్టవిధ నాయికలు.

1. ప్రోషితభర్తృకయనగా: పతిదేశాంతరమునకు పోయియుండ వ్యాకులపడునది. ప్రోషిత భర్తృక యనబడును.

2. ఖండితయనగా : అన్యోపభోగ చిహ్నితుడై ప్రాతఃకాలమందు వచ్చిన పతిని జూచి కోపించునది ఖండితయగును.

3. కలహాంతరితయనగా : పతిని అవమానించి తరువాత తాపపడునది. కలహాంతరిత యనదగును.

4. విప్రలబ్ధ అనగా : సంకేతస్థలంబున పతిరాగానక వంచింపబడి వ్యాకులహృదయయైనది విప్రలబ్ధయనంబరగు.

5. విరహోత్కంఠిత లేక ఉత్క అనగా : సంకేతస్థలంబునకు ప్రియుడు రాడాయెనని విరహముచే చింతించునది విరహోత్కంఠిత లేక ఉత్క అనబడును.

6. వాసకసజ్జిక అనగా : ఇప్పుడు ప్రియుడు రాగలడని సురతసామగ్రి సన్నాహంబుజేయునది వాసకసజ్జిక యనబడును.

7. స్వాధీనపతిక అనగా : యెల్లప్పుడును తనయింగితమెఱింగి ఆజ్ఞనుచేయు పతిగలది స్వాధీనపతిక యనబడును.

8. అభిసారిక అనగా : తాను ప్రియునిగూర్చి అభిసరించునదియేని ప్రియుని అభిసరింపజేయునదియేని అభిసారిక యనంబరగు.



మరియు పతి ఉత్తరక్షణంబుననే పయనంబు పోనిశ్చయించియుండ అది ప్రవత్స్యత్పతికయనియును, పతి ఆక్షణమే దేశాంతరమునుండి వచ్చుచుండగా చూచునది సమగచ్ఛత్పతికయనియు పూర్వులుదహరించిరి. వీరికి ఇతరనాయికలయందు అంతర్భావములేదు.

నాయిక నమ్మికకు పాత్రమై చేరువనుండునది. సఖి లేక చెలికత్తె, దానికి అలంకార, ఉపాలంభ, శిక్షాపరిహాసాదులు కర్మములు.

☞ మరియు యీఅష్టవిధ నాయికలయొక్క లక్షణం, చేష్టలు, వ్యాపారములు మొదలగునవి వివరముగా మొదటిభాగమున, 3 అధ్యాయములో చెప్పబడివున్నవి.

దూతి వ్యాపార పారంగత దూతియనంబడును. దానికి సంఘటనము, విరహము దెలుపుట మొదలగునవి వ్యాపారములై యున్నవి.

## నాయక ప్రకరణము.

నాయకులు :—1. పతి 2. ఉపపతి 3. వైశికుడు అని త్రివిధులు.

(1) పతిఅనగా, విధ్యుక్త ప్రకారమున పాణిగ్రహణము చేసినవాడు పతి యనదగును.

(2) ఉపపతి అనగా ఆచారహాని హేతువగువాడు ఉపపతి యనంబరగు.

3. వైశికుడు అనగా సకలవేశ్యోపభోగ రసికుడు వైశికు డనదగును.

మరియు, పతి :—అనుకూలుడు, దక్షిణుడు, ధృష్టుడు, శఠుడు అని నాలుగు విధముల నొప్పు.

1. అనుకూలుడనగా, పరాంగనా, పరాఙ్ముఖుడై స్వీయయందు అనురక్తుడగువాడు, అనుకూలు డనదగును.

2. దక్షిణుడనగా :—సర్వనాయికలయందు సమమైన అనురాగము గలవాడు దక్షిణుడనందగు.

3. ధృష్టుడు అనగా :—నిశ్శంకముగా నేరము జేసియుండియు, నాయిక యెంతపరిహరించినను పోక, మరియు ప్రియము చెప్పువాడు ధృష్టుడనంబరగు.

4. శఠుడనగా :—కాంతలయందు కపటముజేయ సమర్థుడగువాడు శఠుడనబడును.

నాయకులకు : 1. పీఠమర్దుకు 2. విటుకు 3. చేటుకు 4. విదూషకుడునని నర్మసచివులు నలుగురు గలరు.

1. పీఠమర్దుడనగా కుపితస్త్రీ ప్రసాదకుడు పీఠమర్దుకు.

2. విటుడు అనగా కామతంత్రకలాకోవిదుడు విటుడు.

3. చేటుడనగా సంధానచతురుడు చేటుడు.

4. విదూషకుడనగా అంగములు వికృతములుగా జేసుకొని పరిహాసము జేయువతడు విదూషకుడు. సంభోగవిషయ కేచ్ఛారూపంబగు చిత్తవృత్తి విశేషము రతియనంబడును. రతిస్థాయిభావము శృంగార మనంబడును.

సంభోగశృంగారమనిన్ని, విప్రలంభశృంగారమనిన్ని యిరు దెరగులు గలవి.

1 సంభోగశృంగారమనగా:—దర్శనస్పర్శనాదికము సంభోగశృంగార మనబడును

2. విప్రలంభశృంగార మనగా :—కారణవిశేషముచే విశ్లేషంబగునది విప్రలంభశృంగార మనబడును.

విప్రలంభమున దశావస్థలగును.

☞ ఈశృంగార రసములనుగురించి మొదటిభాగము రెండవఆధ్యాయమున రెండవభాగములో ఆఖరునపూర్తిగా అభినయము లక్ష్యముచేసిన దానిబోధన వినవచ్చురా అనేపదములోనున్న విశదముగా తెలుపబడెను.

ఇట్లు గ్రంధకర్త,

దేవులపల్లి వీరరాఘవమూర్తిశాస్త్రి,

కిర్లంపూడి.



శ్రీరస్తు.

# విషయసూచిక.

మొదటిభాగము.

1 అధ్యాయము.

## రెండవభాగము.

4. అధ్యాయము.

హస్తాదిదృష్టిభేదములు.





ఓం.

శ్రీరస్తు.

శ్రీరుక్మిణీ సత్యభామాసమేత శ్రీగోపాలకృష్ణ గురు పరబ్రహ్మణేనమః.

ఇష్టదేవతా ప్రార్థనాదికము.

ఉ. ఆదరమొప్ప మ్రొక్కెదను ♦ నద్రిసుతాహృదయానురాగ సం
పాదికి దోషభేదికి బ్రి ♦ పన్న వినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి న ♦ శేషజగజ్జన నందవేదికిన్
మోదకఖాదికిన్ సముద ♦ మూషకసాదికి సుప్రసాదికిన్.

ఉ. శ్రీరమణీకళత్రు సర ♦ సీరుహపత్రు విశాలనేత్రు బృం
దారకనాథ మిత్రు గరు ♦ ణాగుణపాత్రు బవిత్రు బూర్ణిమా
నీరజవైరి వక్త్రు గమ ♦ నీయవయఃపటుగాత్రు యోగ భృ
ద్ధీరవ సౌఘచైత్రు వసు ♦ దేవునిపుత్రు మదిం దలంచెదన్.

ఉ. హారికి నందగోకుల వి ♦ హారికి జక్రిసమీర దైత్య సం
హారికి భక్తదుఃఖ పరి ♦ హారికి గోప నితంబినీ మనో
హారికి దుష్టసంపద ప ♦ హారికి ఘోషకుటీ పయోఘృతా
హారికి బాలకగ్రహ మ ♦ హాసురదుర్వనితాప్రహారికిన్.

క. మురళీ నాదముచే భా
సురముగ గోగోపగోప ♦ సుందరుల గడుం
బరవశతను బొందించెడు
మురహరుడు మదీప్సితముల ♦ ముదమున నొసగున్.

గీ. వెలయు సంగీత సాహిత్య ♦ విద్యలెలమి
కుచములే యింతి కియ్యల ♦ గోమరుమిగుల
నట్టిపల్కులదేవి య ♦ య్యభవురాణి
వదలక యొసంగుగాత ♦ వాగ్వైభవంబు.

మ హారికిం బట్టపురాణి పున్నెముల ప్రో ♦ వర్ధంపు బెన్నిక్క చం
దురు తోఁబుట్టువు భారతీగిరిసుత ♦ ల్తోనాడు పూఁబోఁడి తా
మరలందుండెడి ముద్దరాలు జగముల్ ♦ మన్నించునిల్లాలి భా
సురతన్ లేములునాపుతల్లి సిరియి ♦ చ్చు న్నిత్యకల్యాణముల్.

శ్లో॥ కల్యాణాచల వాసాయ । కరుణారససింధవే।
నమోస్తు నందికేశాయ । నాట్యశాస్త్రార్థదాయినే॥

చ. గరిమ భజింతు నెమ్మదిని ♦ గానకళాపరిపూర్ణపూర్ణులా
భరతుని నందికేశ్వరుని ♦ భర్గుని నారదు నత్రి వామనున్
సురగురు శుక్ర గోహలుని ♦ సోముమరుత్తుని యాజ్ఞవల్క్య తుం
బురుఘను భృంగి గౌతముని ♦ భోజపతిన్ మరుకశ్యపాదులన్
నరయ వశిష్టదత్తిలు వి ♦ నాయక షణ్ముఖ శార్ఙ్గదేవులన్.

గీ. తాము రచియింప నెంతయు ♦ దరముగాక
సుగుణులెవరేని రచియింప ♦ సొంపుఁజెరచి
తప్పులని తాము దెలియక ♦ యొప్పిదముల
నుడువు నధమాధముల నెంచ ♦ బుడమి జనునె.

గీ. అరయ జలరాశి యందలి ♦ నెరసుఁ ద్రెంచి
మణిగణంబుల గాంచునా ♦ మహితు పగిది
తప్పులెల్లను విడనాడి ♦ యొప్పిదములె
గొనెడి విబుధాళి నెంతయు ♦ గోరితలతు.

ఉ. న్నాయికి భూనురేంద్ర మృత ♦ నందన దాయికి రుక్మిణీమన
స్థాయికి భూతసమ్మద వి ♦ ధాయికి సాధుజనానురాగ సం
ధాయికి బీతవస్త్రపరి ♦ ధాయికి బద్మభవాండభాండ ని
ర్మాయికి గోపికానివహ ♦ మందిర యాయికి శేషశాయికిన్.

సమర్పణంబుగా నాయొనర్పంబూనిన అభినయ స్వయంబోధిని అభినయశాస్త్రంబున కాధారంబగు మొదటిభాగమున, సంచారీ భావ



ములు, నవరసాలు, అష్టవిధనాయికలు, సాత్వికభావములునుగల నాలుగు అధ్యాయంబులును, రెండవభాగమున అభినయము లక్షముచేసిన, స్వరజతులు, పదవర్ణములు, క్షేత్రియపదములు, జావళ్ళున్ను, హస్తాది, దృష్టిభేదంబులు మొదలగు ననేకాంశములతో నాలుగు అధ్యాయములు కలిగియుండును.

క. పాలకడలిశయాన గో ♦ పాలకృష్ణ
వ్రాసితిని దీని నీదయా ♦ బలముకలిమి
దప్పులున్నను సుజనుల ♦ మెప్పువడసి
ధరను వెలయుత నాచంద్ర ♦ తారకముగ.



శ్రీరస్తు.

శ్రీగురుపరబ్రహ్మణేనమః.

# అభినయస్వయంబోధిని.

---

## మొదటిభాగము.

### సంచారీభావములు ప్రారంభము.

### ౧ వ అధ్యాయము.

### 1. నిర్వేదము.

నిర్వేదమనగా, 1 దుఃఖము; ఈర్ష్య, తత్వబోధవల్లను, సర్వము నిష్ఫలము గావించుట, నిర్వేదమనబడును.

2 తత్వజ్ఞానము, పేదరికము, సంకటము, వియోగము దుఃఖము మొదలయిన వానిచేగలుగు ఫలాభావమతి, నిర్వేదమనబడును.

3 నిరాశజేసుకొనుటే నిర్వేదము.

నిర్వేదము; గతశోకకృత్యములను తలచినపుడు పుట్టునది.

నిర్వేదము అభినయించవలసిన పద్ధతి యేలాగనగా:—

1 విచారము,-కన్నీరుపిడుచుట
2 నిట్టూర్పు అనగానిశ్వాసయును
3 దైన్యమున్ను
} పట్టవలెను.

దైన్యములో పట్టవలసినవి.

1 బలముపిడుచుట;
2 అతిశయును అణచుకొనియుండుట
3 మాటలయందు, ముఖమందు, నేత్రములయందు పేదరికము కనబరుచుట }
4 శరీరమును కుంచుకొనుట
5 నమస్కరించుట
6 వేడుకొనుట
యీ మొదలైనవి పట్టవలెను.



ఇవి

1 కన్నీటిలో నడ్డగింపుటచేతను
2 ధ్యానముచేతను
3 నిట్టూర్పుచేతను
4 తనుదా నవమాన పర్చుకొనుటచేతను
5 దైన్యముచేతను
6 డగ్గుత్తుక అనగా గద్గదస్వరముచేతను
7 వన్నెమారుటచేతను
అభినయించేది.

N. B ఇష్టార్థముయొక్క లేమిచేతను, క్రోధముచేతను, తాడనముచేతను ఆక్షేపణచేతను పరులవృద్ధిని చూచుటచేతను నిందచేతను అపవాదముచేతను మోసముచేతను కలిగెడు నిష్ఠురత్వబుద్ధి నిర్వేదమనబడును.

నిర్వేదము=కరుణారసమందును, భీభత్సరసమందును బుట్టును.
కరుణారసము=దుఃఖమువలన బుట్టును.
భీభత్సరసము=విచారమువలన బుట్టును.

### 2 శ్రమము.

శ్రమము=అనగాప్రయాసము; యిందువలన స్వేదముకలుగును.

(యిందులో 2 సాత్వికభావమున్నది.)

త్రోవనడచుట, నృత్తమాడుట, క్రీడ మొదలగు వ్యాపారములచే గలుగు మానసభేదము శ్రమమనబడును.

వేట, జగడము, గుఱ్ఱమునెక్కుట ఆట శస్త్రాస్త్రవ్యాపారము ఇవి మొదలగు వానిచేతను కలుగునది శ్రమము.

శ్రమము అభినయించే పద్ధతి యేలాగనగా

1 చమటబిందువులుతుడుచుకొనుట (2 స్వేదమనే సాత్వికభావమున్నది)
2 శరీరమును నల్చుకొనుట
3 నీడయందునిల్చుట
4 విసురుకొనుట
5 అర్ధనిమీలినము, అనగా సగముకన్నులు మూయుట.

మరియొకపద్ధతి యెలాగనగా:.

1 అంగమర్దనము
2 నిట్టూర్పు
3 కాళ్ళుపిసుకుట
4 ఆవలింత
5 మందముగ నడచుట
6 ముఖము, కన్నులు, వంకరజేసుకొనుట
7 సీత్కారముజేయుట, అనగా, చెలిమివల్లనైన నిరాకరము.

ఈ అనుభావములు కలుగును.

శ్రమానుభావములు.

1 నిట్టూర్పు,
2 చెమట, ఇది 2 సాత్వికభావము.
3 సీత్కారము అనగా చెలిమివల్లనయిన నిరాకరము.
4 ముఖనేత్రములు సంకోచించుట సంకోచం అనగా ఇముడ్చుట.
5 చలిగాలి, సీడ, నీళ్ళు వీనియందపేక్ష.
6 అంగమర్దనము, ఇది 1 సాత్వికభావం.
7 దేహముడుగుటయు.
ఇవిశ్రమానుభావములు.

శ్రమము.

హాస్యరసమందును కరుణారసమందును భయానకరసమందును బట్టును,

3. దైన్యము; దీనత్వము.

బలముచెడి శత్రువునకు దయవచ్చునట్లుగా బలుకుట.

తనకుబలము చాలక కార్పణ్యముచేతను ఆడుకొనుటే దైన్యము.

మనస్సున కుత్సాహములేకుండుట:—

దుఃఖము, మనోవ్యధ, రోగము, దారిద్ర్యము, మనస్సువ్యాకులపడుట, వీనిచే గలుగును.

దైన్యము అభినయించేపద్ధతి యేలాగనగా.

1 బలమును విడుచుట
2 అతిశయమును అణచుకొనియుండుట
3 మాటలయందు ముఖమందు నేత్రములయందు పేదరికము కనపర్చుట
4 శరీరమును కుంచుకొనుట
5 నమస్కరించుట
6 వేడుకొనుట

ఇందు.

మాలిన్యదేహస్తంభాద్యనుభావములు గలుగును:—



దైన్యముచేత.

1 అంగములు సిధిలములవుట (సిధిలముఅనగా వదులైనవి)
2 అలంకరించుకొనకుండుట.
3 ముఖమున కన్నీరుపట్టులుండుట పట్టుఅనగా (నీరుపట్టిపోవుట అనగాయెండిన నీటిపక్కు.)
4 హీనస్వరము ఇవికలుగును అనిలక్షణము.

దైన్యము

కరుణారసమందు శృంగారరసమందు భీభత్సరసమందును బుట్టును.

మాలిన్యదేహమనగా=మకిలశరీరముగా నుండుట.

స్తంభమనగా=కదలకుండుట ; ఇదిసాత్వికభావములోది,

4. జడత, జాడ్యము; వ్యాధి; మాంద్యము.

మనస్సుయందైన కోరిక చేకూరినప్పటికి అలపుయరగకుండా యుండుట—

ఇష్టార్థము అనిష్టార్థము వీని వినికి వలనగాని వర్షమువలనగాని విరహము మొదలైనవానివలనగాని కలుగుఅజ్ఞానము జడత అనబడును.

ఇష్టాజ్ఞానముచేతనయినా కార్యంమందపడుటే.

ఇష్టమునుగాని యనిష్టమునుగాని చూచుట మొదలైన వానిచేత నోడలుమరచుట:—

ఇందు.

1 రెప్పపాటులేకయుండుట ఇది 1. సాత్వికభావము
2 చెవులువినకయుండుట
3 పరవశుడౌట, పరవశముఅనగా వ్యసనసంతోషాతిశయముచే మైమరచుట.
4 ఊరకయుండుట;ఇది 2 సాత్వికభావము

మొదలగు చేష్టలుగలుగును.

మరియొకపద్ధతి.

1 రెప్పపాటువేయకచూచుట

2 ప్రాశ్రికే యుంచుట అనగా చెలికత్తియలు దగ్గిరవుండుటచే కలిగిన శిగ్గువల్లను ప్రియుడు వచ్చుటచేకలిగిన సంతోషమువల్లను చేయవలసిన పనులు తోచకయుండుట:—

జడత

భయానకరసమందును, భీభత్సరసమందును, కరుణారసమందును, శృంగారరసమందును, బుట్టును.

5. గ్లాని ; పీడ ; అనగా బాధ ; దుఃఖము.

(4 సాత్విక భావమున్నది)

తనకువుండే సామర్థ్యముచెడి ఆయాసముచే అడలుతూవుండుట.

మనోవ్యాని, రోగము, ముసలితనము, దప్పి, వ్యాయామము సురతము, ఇవి మొదలగువానిచే గలుగు దౌర్బల్యము :—

బలిమి తగ్గుటే గ్లాని:—

యిందు

1 దేహముచిక్కుట
2 సన్నపలుకులు
3 మెల్లనపనులు
4 సకల విషయములయందు ఉత్సాహములేకయుండుట
5 దేహవైవర్ణ్యము; వైవర్ణ్యమనగా వెలవెలబోవుట
6 గుడ్లు తిరుగుట
ఇవి మొదలైన వికారములు గలవు.

మరియొకపద్ధతి

ఆకలిదప్పికలవలన లేక రతిమొదలయిన వానివలన కలిగిన ఆయాసముచేత సంభవించిన బలహీనతను కనపర్చవలసినది.

గ్లాని.

భయానకరసమందును కరుణారసమందును శృంగారరసమందును హాస్యరసమందును బుట్టును.

6. త్రాసము; భయము.

యిందులో 1. 3. 4. 5. సాత్వికభావములున్నవి.

ఆకస్మికముగా బుట్టినభయముచేతను మనస్సు తడబాటును పొందుట.



పున్నట్టుండి దిగులుపడుటే త్రాసము.

మెరుపు రాక్షసులు ఉరుము పిశాచము సర్పము మొదలయిన వానిచేగలుగు చిత్తచాంచల్యము త్రాసమనబడును.

ఇందు,

1 ఉత్కంపము (1 సాత్వికభావము)
2 దేహసంకోచము (2 సాత్వికభావము) సంకోచమనగా యిముడ్చుట
3 రోమాంచము (ఇది 3 సాత్వికభావం)
4 స్తంభము (ఇది 1 సాత్వికభావం)
5 గద్గదము (ఇది 4 సాత్వికభావం)
6 అడుగడుగునకు రెప్పపాట్లు (ఇది 5 సాత్వికభావం)
7 భ్రమ ; అనగా లేనిది తోచుట తిరుగుట పిచ్చి (ఇది 4 సాత్వికభావం)
8 ప్రక్కనుండువారిని పట్టుకొనుట (ఇది 7 సాత్విక భావం)
మొదలైనవికలుగును.

మరియొకపద్ధతి.

1 శరీరమువణకుట(ఇది5 సాత్వికభావం)
2 శరీరము ముణుచుట (ఇది 2 సాత్విక భావము)
3 రోమకూపములునిక్కుట (ఇది 3 సాత్వికభావము)
4 చిత్తభ్రాంతిని పొందుట (7 సాత్వికభావము)
5 కన్నులు చికిలించుట (ఇది 6 సాత్వికభావము)
6 కాళ్ళు తడబడుట.
7 ప్రియుణ్ని కౌగలించుకొనుటను కనపర్చుట (ఇది 8 సాత్వికభావము)

త్రాసము.

భీభత్సరసమందును భయానకరసమంధును శృంగారరసమందును బుట్టును.

శంక; సంశయము.

యిందులో 4, 6 సాత్వికభావములున్నవి

తనకు యిష్టముగాదేమోయని సందేహించుట.

అరిష్టమైన సంగమమును వుత్ప్రేక్షించుటే.

చౌర్యాపరాధాదులచే దన కహితము నుత్ప్రేక్షించుట.

ఇందు

1 వర్ణము మారుట (5 సాత్వికభావము)
2 గద్గదిక అనగా స్వరభంగము (ఇది 4 సాత్వికభావము)
3 దిక్కులుజూచుట (1 సాత్వికభావము)
4 అద్దము మొదలైనవిచూచి చంద్రుడు మొదలైనవిగానూహించుట
5 మనస్సులోనున్న అనురాగము వెల్లడిఅయినదని సందేహించుట.

ఇందు

1 మాటిమాటికి పార్శ్వములను జూచుట (3 సాత్వికభావము)
2 మోముదాచుట
3 ముసుకిడుట
4 వైవర్ణ్యము అనగా వెలవెలబోవుట (ఇది 6 సాత్వికభావము)
5 కంఠగద్గదము ఇది 4 సాత్వికభావము

మొదలైన చేష్టలుగలుగును.

ఈశంక ఆత్మోత్థశంకయనియు పరోత్థశంకయనియు ఇరుదెరగులౌను.

స్వకార్యమువలన కలుగునది ఆత్మోత్థశంకయనియు

యిందుల

ఇంగితములు రెప్ప కనుబొమ్మలు నల్లగుడ్లు చూపు వీనియందుగలుగు వికారములు ఇతరుల ఆకారములవలన గలుగుచెమట పరోత్థశంకయనబడును.



వరుసగా నాకారచేష్టాదులచే ఈరెండువిధములశంకను ఊహింపవచ్చును; ఆకారము సాత్వికము చేష్టలు అంగప్రత్యంగములయందు గలుగు క్రియాభేదము.

శంక, శోకసంశయము.

శృంగారరసమందు, కరుణారసమందు భీభత్సరస మందును బుట్టును.

N.B. శంకయనగా దన కసమ్మతము కలుగునేమోయను తలంపు దొంగతనము రాజాపరాధము మొదలగువానివలన పట్టుబడుట దీనికిగారణము;

1 ముఖము వెల్లబారుట
2 పెలవులునాకుట
3 ఒకరినొకరు చూడబూనుట
4 మాటిమాటికి దిక్కులుజూచుట

ఇవి దానికనుభావములు.

8 ఆర్తి, వ్యాధి; రోగము.

యిందులో 1, 3, 5, సాత్వికభావములున్నవి.

హృదయమందైన తాపము రెట్టించి బహిర్వ్యాపకమైనదై యెల్లప్పుడు శరీరపీడ ఆర్తియనబడును:—

ఆర్తి మరణాదులచేత సంభవించునది.

రోషోద్రేకముచేతను వియోగాదులచేతను గలుగు జ్వరము.

ఇందు

1 దేహముస్తంభించుట (ఇది 1సాత్విక భావము)
2 అంగము బిగితగ్గిపోవుట
3 అరచుట
4 ముఖము వంకరబోవుట
5 వ్యర్థమగు అంగవిక్షేపముజేయుట (ఇది 5 సాత్వికభావము)
6 నిట్టూర్పు మొదలయినవి గలుగును.

ఆజ్వరము; శీతజ్వరమని దాహజ్వరమని ఇరుదెరగులౌను.

శీతజ్వరమందు

1 తాపము;
2 దేహముచిక్కుట;
3 చెక్కిళ్ళు చలించుట
4 కన్నీరు నించుట
5 సర్వాంగమును వణకుట (ఇది 5 సాత్వికభావము)
6 అరచుట; (ఇది 3 సాత్వికభావము)
7 మోకాళ్ళు వణకుట
8 పులకరింపు; (ఇది 3 సాత్వికభావము)
9 ముఖము వాడుట

మొదలైనవి గలుగును.

దాహజ్వరమందు;

1 చల్లనిపూలదండ మొదలైనవానిని ధరించుట
2 చేతులు కాళ్ళు ఎత్తెత్తివేయుట
3 మొగము వాడిపోవుట

మొదలైనవి గలుగును.

మరియొకపద్ధతి.

1 చల్లనివస్తువులయందున్ను చల్లనిప్రదేశములయందున్ను అపేక్షగలుగుట.
2 వేడివస్తువులయందు అపేక్షగలుగుట

ఆర్తి;

కరుణారసమందు; శృంగారరసమందు పుట్టును.

9. రోషము, అమర్షము, క్రోధము.

యిందులో 2 సాత్విక భావము వున్నది.

ఎక్కడను అపరాధము జేసినవారియందు మనస్సు ప్రజ్వరిల్లగా అది రోషమనబడును:—

తక్కువచేయుట అవమానముచేయుట మొదలైనవానిచేతగలుగు క్రోధము అమర్షమనబడును.

యిందు

1 చెమటగలుగుట (ఇది 1 సాత్వికభావం)
2 తలపంకించుట (ఇది 3 సాత్వికభావము)
3 చింతించుట అనగా ఆలోచనచేయుచున్నట్టులుండుట (ఇది 4 సాత్వికభావం)
4 ఉపాయమును వెదకుట
5 ఉత్సాహపడుట } ఇవి 5 సాత్వికభావములోవి.
6 తర్జనభర్జనలు కనపర్చుట



1 స్వేదము (ఇది 2 సాత్వికభావము)
2 శిరఃకంపము డిటో
3 తలవంచుకొనుట
4 చింతించుట (ఇది 3 సాత్వికభావము)
5 ఉపాయములను వెదకుట ఇది 4 సాత్వికభావము
6 ఉత్సాహము (5 సాత్విక భావము)
7 వ్యవసాయము

మొదలైనవి కలుగును

రోషము.

వీరరసమందు, రౌద్రరసమందు బుట్టును.

10. గర్వము; దర్పము.

పరులను నిందజేసి తనను నుతిజేసికొనెడు అతిశయమైన ఔన్నత్యము గర్వమనబడును.

ఐశ్వర్యము రూపము యౌవనము కులము విద్య బలము ఇష్టలాభము మొదలైనవానిచేత నొరుల నవమానించుట గర్వమనబడును.

ఇందు.

1 బలమువల్లను అన్యులను ధిక్కరించుట (ఇది 6 సాత్వికభావము)
2 ఐశ్వర్యమువల్ల అన్యులను తక్కువగాజూచుట
అనగా అవమానపుచ్చుట (1 సాత్వికం)
3 తనది మంచికులమనిన్ని తనయందు చక్కదనమున్నదనిన్ని వయ్యారముల నుశరీరమును చూచుకొనుటను కనపర్చవలయును.

మరియొకపద్ధతి.

1 అహంభావము (ఇది 2 సాత్వికం)
2 ఆజ్ఞోల్లంఘనము
3 అనుగ్రహప్రధానము
4 మోము త్రిప్పుకొనుట
5 మాటాడకయుండుట
6 పరుషముగమాటలాడుట ఇది 1 సాత్వికభావము
7 చూడకయుండుట
8 తనఅవయవములను జూచుకొనుట
9 ఒడలు విరచుకొనుట

మొదలైన యను భావములు గలుగును.

గర్వము.

వీరరసమందును రౌద్రరసమందును శృంగారరసమందును హాస్యరసమందును బుట్టును.

## 11. ఆవేగము.

(ఇందులో 3 సాత్వికభావముకలదు)

ఇవి యెనిమిదివిధములు.

క్రమముగా ఇష్టము అయిష్టము రావడమువల్లపుట్టిన మనస్సుయందైనతొందర ఆవేగమనబడును.

మనస్సుయొక్క తడబాటు.

ఇష్ట అయిష్టజ్ఞానమువల్ల పుట్టిన భ్రమతోటి దురుసే;—కార్యముచేతనయిన త్వర.

ఉత్సాహముచేతను వాతముచేతను వర్షముచేతను నిప్పుచేతను గుఱ్ఱముచేతను మదపుటేనుగుచేతను ప్రియాప్రియములు వినుటచేతను గలుగు సంభ్రమము.

యిందులో

1 ఇష్టప్రాప్తివల్ల గలిగిన మనస్సుయొక్క తొందరలయందు హర్ష త్వరలనున్ను.

2 అనిష్టప్రాప్తివల్ల కలిగిన తొందరయందైతే శోకస్తంభనములున్ను పట్టవలెను:—

హర్షమునకున్ను త్వరకున్ను స్తంభనమునకు అనగా నిలకడకున్ను శోకమునకున్ను పట్టవలెను:—

ఒకకంటికే కాటుక ఒకకాలికే పారాణి అలంకారములను నగలను వ్యత్యాసముగా ధరించుట అనగా కంఠమందు వడ్డాణమున్ను నడుముకు ముత్యాలహారమున్ను చెవికి ముక్కుమిక్కిన్ని ముక్కుకు బావిలీలున్ను ధరించుట; ఇవి యిష్టప్రాప్తియందు జరుగుతవి; గనుక యీలాగునపట్టవలెను.



ఆయావేగములు 8 విధములు.

1 ఉత్పాతావేగమనియు;
2 వాతావేగమనియు;
3 వర్షావేగమనియు;
4 అగ్న్యావేగమనియు;
5 మత్తకుంజర దర్శనావేగమనియు;
6 ప్రియశ్రవణావేగమనియు;
7 అప్రియ శ్రవణావేగమనియు;
8 శాత్రవ వ్యసనావేగమనియును;
కారణానుసారముగా నెనిమిదితెరగులవును.

### 1 ఉత్పాతావేగమందు గలుగుచేష్టలు.

1 కొండమొదలైనవి కదలుట
2 ధూమకేతువుదయమవుట
} మొదలైనవి ఉత్పాతమౌను.

1 దీనివలన గలిగిన సర్వాంగవిస్రంసము; వైమనస్యము అపసర్పణము ఇవి ఉత్పాతావేగమనబడును.

### 2 వాతావేగమందు గలుగుచేష్టలు.

1 వేగముగనడచుట;
2 వస్త్రము తీసుకొనుట;
3 వస్త్రములను కప్పుకొనుట
4 కన్నులను తుడుచుకొనుటమొదలైనవి పెద్దగాలిచేగలుగుక్రియలు.

### 3 వర్షావేగమందు గలుగుచేష్టలు.

1 గొడుగును గ్రహించుట
2 దేహము చిన్నదవుట
3 చేతులను భుజమూలములయందు జేర్చుట
4 పరుగెత్తుట;
5 గుప్తస్థలము నాశ్రయించుట; మొదలైనవి వర్షావేగముచేత గలుగు క్రియలు (గుప్తమన గామరుగు)

4 అగ్న్యావేగమందు గలుగుచేష్టలు.

1 వీజనము;
2 అంగధూననము;
3 వ్యత్యాసముగనడుగులుంచుట;
4 నేత్రసంకోచము;

యీమొదలైన చేష్టలు గలుగును.

5 మత్తకుంజరదర్శనావేగమందు గలుగుచేష్టలు.

ఏనుగుచేగలుగు నావేగమందు.

1 త్వరగాపరుగెత్తిపోవుట;
2 వెనుకప్రక్క తిరిగితిరిగిచూచుట
3 భయము;
4 వణుకు; మొదలైనవిగలుగును.

6 ప్రియశ్రవణజావేగోయథా; యిందుగలుగుచేష్టలు.

1 అభ్యుత్థానము
2 ఆలింగనముజేసుకొనుట
3 ప్రీతిపురస్సరముగ వస్త్రాభరణాదులు నిచ్చుట
4 ప్రియమయినవాక్యము
5 రోమాంచము (ఇది 3 సాత్విక భావము)
మొదలైనవి గలుగును.

అప్రియశ్రవణావేగమందుగలుగు చేష్టలు.

1 ఏడుపు
2 పొరలాడుట
3 మొరబెట్టుట
4 క్రిందబడుట
5 నాలుగుప్రక్కల దిరుగుట మొదలైనవి గలుగును

8 శాత్రవవ్యసనావేగోయథా; ఇందుగలుగుచేష్టలు.

1 కవచముధరించుట
2 ఆయుధముమొదలైనవస్తువులను ధరించుట
3 ఏనుగునెక్కుట
4 అశ్వము నెక్కుట
5 రథము నెక్కుట
6 త్వరగా విశ్రమించుట
మొదలైనవి గలుగును.

N. B. ఇవి ఉత్తమాదులకు యథోచితముగ గలుగును:—

ఆవేగము.

అద్భుతరసమందును వీరరసమందును శృంగారరసమందును పుట్టును.



12 ధృతి, ధైర్యము.

మనస్సు కృతార్థత్వమును పొందగా గలుగునది.

అభీష్టాజ్ఞానముచేతను మనస్సుకు ధైర్యము తెచ్చుకొనుట;

మోక్షవిషయజ్ఞానము శాస్త్రజ్ఞానము గురుభక్తి నానావిషయములస్థితి సిగ్గు మొదలైనవానిచేత మనస్సునకు ఇచ్ఛలేకయుండుట.

యిందు

1 లభించినదానిని అనుభవించుట
2 పొందబడని విషయములు వీనికిగాను మనస్సున చింత లేకయుండుట.
3 కడచిన విషయములు వీనికిగాను మనస్సున చింత లేకయుండుట.
4 నష్టవిషయములు వీనికిగాను మనస్సున చింతలేకయుండుట.
మొదలైనవి గలుగును.

మరియొక పద్ధతి.

1 ధైర్యమును; 2 సంతోషమును కనపర్చవలెను.

ధృతి.

వీరరసమందును శృంగారరసమందును బుట్టును.

13. స్మృతి; జ్ఞాపకము.

పూర్వమందు అనుభవించిన వాటిని స్మరణచేయుట స్మృతి.

గత మనుభవించిన నాయకుడు తనయిచ్ఛగా వీధికిరాగాచూచి వీడు పూర్వము అనుభూతనాయకుడని జ్ఞాపకము తెచ్చుకొనుటే స్మృతి అనబడును.

స్మృతి అనగా జ్ఞాపకము:—

మనోభ్యాసబలముచేతను తనంతటను సమానవస్తువుల చూపు మొదలైన వానిచేగలుగు పూర్వానుభూతార్థజ్ఞానము.

యిందు

1 కనుబొమలు యెగరవేయుట (ఇది 3 సాత్వికభావము)
2 తలఆడించుట (ఇది 1 సాత్వికభావము) మొదలైనవిగలుగును.

మరియొక పద్ధతి

1 సిరస్సును ఆడించుట
2 ఊచుట (ఇది 2 సాత్వికభావము)
3 కనుబొమ్మలు విక్షేపములు, మొదలైనవిగలుగును.

స్మృతి.

అద్భుతరసమందును కరుణారసమందును బుట్టును.

## 14. చాపలము, చపలత్వము; చాపల్యము; చపలత.

రాగము అనగా ప్రేమ ద్వేషము వీటివల్ల పుట్టిన చేష్టలు మొదలైనవాటియొక్క అవస్థలేకుండుట చాపల్యమనబడును.

రాగద్వేషములవల్ల నిలకడలేని జ్ఞానమె చపలత్వమనబడును.

అన ద్వేషము మొదలైనవానిచే మనస్సులోగలుగు లాఘవము.

ఇందు!

1 చెలులనుదండించుట;
2 చెలులను కఠినములాడుట;
3 చేయుపనులయందు స్వతంత్రత్వమును[కనపరచుట;
4 దృష్టిని చంచలముజేయుట ;
5 విలాసమైనచిరునవ్వునవ్వుట
6 ముత్యాల హారములను కదల్చుట;
7 కంఠాభరణములను అంటుకొనుట;
యీపైక్రియలలో నొకదానియందైనను క్షణమైనను నిలకడలేకయుండుట.

మరియొక పద్ధతి.

1 యోచింపక కౌగలించుకొనుట (ఇది 3 సాత్వికభావము)
2 చూచుట (ఇది 4 సాత్వికభావము)
3 వెళ్ళుమనుట
4 కఠినపుమాటలు; (ఇది 2 సాత్వికభావము)
5 కొట్టుట
6 ఆజ్ఞాపించుట (ఇది 1 సాత్వికభావము)
మొదలైన చేష్టలు గలుగును



చాపలము.

రౌద్రరసమందును శృంగారరసమందును బుట్టును.

## 15. ఉగ్రత.

(ఇందులో 2 సాత్వికభావములు కలవు.)

ఎగ్గుపుట్టగా మిక్కిలి చండత్వము ఉగ్రతఅనబడును.

అపరాధము అవమానము దొంగతనము నిగ్రహము అసత్యప్రలాపము మొదలైనవానిచే జేయబడిన త్వర ఉగ్రతఅనబడును.

ఇందు

1 ఘుడిపించుట (ఇది 6 సాత్వికభావము)
2 చెయ్యివిసరుట
3 కొట్టుట (ఇది 3 సాత్వికభావము)
4 కట్టుట అనగా బంధించుట (ఇది 2 సాత్వికభావము.
5 హద్దుమీరుటఅనగావున్నస్థితినిమీరియుండుట
6 కళ్ళు యెర్రజేయుట (ఇది 1 సాత్వికభావం)
మొదలయినవిగలుగును.

మరియొకపద్ధతి

1 కన్నులు ముఖము యెర్రనవుట (ఇది 6 సాత్వికభావము)
2 బంధనముజేయుట (ఇది 4 సాత్వికభావము)
3 కొట్టుట (ఇది 3 సాత్వికభావము)
4 తల యాడించుట
5 చెమటపోయుట (ఇది 2 సాత్వికభావము)
6 బెదరించుట (ఇది 1 సాత్వికభావం)
మొదలైనవి కలుగును.

ఉగ్రత!

వీరరసమందును రౌద్రరసమందును పుట్టును.

## 16. అవహిత్థ, అంగగోపన.

ఆకారమును రహస్యము జేయుట అవహిత్థ.

వెరపు శిగ్గు ఇవిమొదలగు వానిచేత నాకారగోపనము చేయుట.

ధైర్యము ప్రాభవము నీతి శిగ్గు సాధ్వసము దాక్షిణ్యము ప్రాగల్భ్యము అపజయము ఇవిమొదలైన వానిచేగలుగు ఆకారగుప్తిఅవహిత్థ లేక అంగగోపన యనబడును. (సాధ్వసము అనగా భయము)

ఇందు

1 వేరుగజెప్పుట(1 సాత్వికభావము)
2 అబద్ధపు ధైర్యము
(2 సాత్వికభావము)
3 మరివకప్రక్కజూచుట
(5 సాత్వికభావము)
4 కథాభంగము
మొదలైనవిగలుగును.

మరివకపద్ధతి.

వూరికేమరివకలాగుచెప్పుట
1 అనగాబొంకుట (1 సాత్వికభావము)
2 వుల్లిక్కిధైర్యముకనపరుచుట
(2 సాత్వికభావము)
3 కాలి బొటనప్రేలితో లేక కాలితో
తలవంచుకుని నేలవ్రాయుట
4 వేరొకవిధమున బలుకుట
(1 సాత్వికం)
5 మరివక ప్రక్కజూచుట
(3 సాత్వికభావము)
6 మరివకప్రక్కనుండుట
మొదలైనవిగలుగును.

అవహిత్థ.

శృంగారరసమందును హాస్యరసమందును బుట్టును.

17. త్రప, వ్రీడ, లజ్జ, శిగ్గు.

మనస్సు ముణిగియుండుట త్రపయనబడును.

అకార్యముజేయుట అవమానము స్తోత్రము నూతనసంగమము ప్రతికారక్రియ మొదలైనవానిచేత అతిదారుఢ్యము లేకయుండుట:—

ఇందు

1 మరుగుగమాటాడుట ;
2 తలవంపు ;
3 యోచించుట ;
4 బయటరాకుండుట ;
5 దూరముగానే ముసుకిడుట ;
6 గోళ్ళుగిల్లుట ;
7 నేలగీరుట.
ఇవి మొదలైనవి గలుగును.



మరివకపద్ధతి

1 ముఖముమళ్ళించుకొనుట
2 ముఖము వెలవెలబోవుట;
3 ముఖమును క్రిందుజేయుట (ఇది 2 సాత్వికభావము)
4 చూపునందు విశేషముగా రెప్పపాట్లుతెచ్చుకొనుట
5 చూపును మళ్ళించు కొనుట
మొదలైనవి గలుగును.

త్రప.

శృంగారరసమందు బుట్టును.

18. విషాదము, ఖేదము.

ఇందులో 7 సాత్వికభావము గలదు.

బుద్ధికి అనేకవిధములయొక్క భావములు మొదలైనవాటికి యెల్లప్పుడు భంగముగలుగుట విషాదమనబడును.

వుపాయమువల్ల మనస్సునకు కలిగే భంగమే విషాదము.

తానారంభించినపని సాగకుండ ఇష్టపదార్థాప్రాప్తి విపత్తు తప్పనెరుగుట వినివలనగలుగు ననుతాపము విషాదమనబడును.

ఇందులో

1 యేమిచేయనుఅని వుపాయమును వెదకుట;
2 చేతులు పిసుక్కొనుట;
3 మనస్సు మనస్సులో లేకుండుట అనగా చేతులు పిసుకుకొంటూ యిటూఅటూ చూస్తూతిరుగుట ;
4 ముఖము విచారమును బొందినట్టు కనపర్చుట;
మొదలైనవి గలుగును.

ఆవిషాదము.

ఉత్తమ మధ్యమ అధమముల యాశ్రియమువలన మూడుతెరగులు గలదియగును.

1. ఉత్తమునివిషాదమందు

1 సహాయమును వెతకుట;
2 ఉపాయచింత ;
} మొదలైన వ్యాపారములుగలుగును

2 మధ్యముని విషాదమందు

1 ఉత్సాహములేకయుండుట;

2 మిక్కిలిచింతించుట;

3 కార్యాకార్యములు తెలియకయుండుట;

4 యెవరిని తలయెత్తిచూడకుండుట;

5 భ్రమించుట; అనగాభ్రమనుపొందుట, మొదలైనక్రియలు గలుగును.

3 అధముని విషాదమందు.

1 రోదనము (ఇది 7 సాత్త్వికభావము

2 నిట్టూర్పు

3 ధ్యానము అనగా మనస్సు నిల్పి దేవుని జింతించుట

4 ముఖమువంకర జేయుట

మొదలైనవిగలుగును.

విషాదము

భీభత్సరసమందును శృంగారరసమందును బుట్టును.

18. మదము.

(ఇందులో 4 సాత్త్వికభావము గలదు)

మద్యపానము చేయుట మొదలైన వాటియొక్క సంతోష మోహాతిరేకము మదమనబడును.

మధుపానాదులచేత మిక్కిలి హర్షమునుపొందుట మదమనబడును.

మద్యమును మొదలైనవానిచేగలుగు ఆనందసమ్మోహముల యొక్క సంభ్రమము:— ఇందు

1 మాటలయొక్క తొట్రుపాటు అనగా తడబడుట

2 శరీరము తూలుట

3. నవ్వు అనగా పెద్దనవ్వు

4 యేడుపు

5 ఉత్తముడు నిద్రించుట

6 మధ్యముడు నవ్వుట-పాడుట

7 అధముడు గర్హనములాడుట; యేడ్చుట.



ఆమదము మూడువిధములు ; ఏలాగనగా

1 తరుణ మదమనియు,

2 మధ్యమ మదమనియు,

3 అపకృత మదమనియు.

1 తరుణమదమందు.

1 గర్వపుచూపు; అనగానిర్లక్ష్యముగా పెడముఖముబెట్టి చూడవలెను

2 ముఖమందు ఎఱుపు

3 చిరునగవు

4 సంభ్రమమును గలపలుకులు

5 ఒయ్యారపునడక

ఇవిమొదలైనచేష్టలుగలుగును

2 మధ్యమ మదమందు

1 వాక్కునతడబాటు (ఇది 4 సాత్త్వికం)

2 గుడ్లుతిరుగుట

3 వంకరగనడచుట

4 చేతులనాడించుట

5 వ్రేలవేయుట

మొదలైనచేష్టలు గలుగును.

3 అపకృష్టమదమందు

1 గతిభంగము

2 మూర్ఛిల్లుట

3 తెలివితప్పియుండుట

4 ఉమియుట

5 ఎక్కిళ్ళు

6 వాంతి

మొదలైనచేష్టలుగలుగును.

1 ఉత్తమమదమును గలవాడు పండుకొనియుండును.

2 మధ్యమమదమును గలవాడు నవ్వుచు పాడుచునుండును.

3 అధమమదమును గలవాడు కఠోరముగను వికారముగను మాటలాడుచును దుఃఖించుచునుండును:—

మదము.

భీభత్సరసమందును వీరరసమందును రౌద్రరసమందును శృంగారరసమందును బుట్టును.

20. ఔత్సుక్యము, ఉత్సుకత, ఉత్సాహము.

హఠాత్తుగా సమయమందు అసమర్థత ఔత్సుక్యమనబడును.

నిముషమాత్రం ఓర్వలేక త్వరపడే వేడుక:—

కోరినవస్తువు లభింపక ముందొకక్షణమైన తాళజాలక పోవుట.

ఔత్సుక్యమునకు అనుభావములు.

1 సంతాపము అనగా మన్మథతాపము.

2 మనశ్చింత

3 నిట్టూర్పు

4 ఎచ్చటనయిన పోబూనుట

ఔత్సుక్యమనగా ఉత్సాహము.

ఆసము మొదలైన వానిచేగలుగు జాగును తాళలేకయుండుట ఔత్సుక్యమనబడును.

ఇందు

1 మనస్సు కాకజెందుట ;
2 త్వర (ఇది 1 సాత్వికభావము)
3 నిశ్వాసము
4 నిద్ర
5 తాళలేకపోవుట
6 కాలమును సహించక తొందర పడుటఅనగాఇష్టవస్తువులభించుటకు ఆలస్యమైనప్పుడుతొందర బడుట
7 చింతచేత యేమియు తోచకుండుట (3 సాత్వికభావము)
8 శరీరభారము కనపర్చుట (4 సాత్వికభావము)
9 శయనించుటయందు అభిలాష పడుట

మొదలైనవి గలుగును.

మరియొక పద్ధతి.

1 వేగముగనడచుట (ఇది 2 సాత్వికభావము
2 పడకలోనుండి లేచుట
3 చింతించుట (ఇది 7 సాత్వికభావము)
4 శరీరము బరువగుట

మొదలైనవిగలుగును

ఔత్సుక్యము.

భీభత్సరసమందును రౌద్రరసమందును శృంగారరసమందును బుట్టును.



## 21 మతి.

మనస్సునందు అర్థమును నిర్ణయించుట మతి అనబడును.

అనేక శాస్త్రార్థములను చెప్పుటవలనగలుగు అర్థనిర్ణయం.

ఇందు

1 బోధనచేయునట్లుకనపర్చుట;
2 సంశయ నివారణమైనట్లుకనపర్చుట ;
3 తెలిసి వ్యవహరించుట;
4 సంతోషమును కనపర్చుట.

మరియొక పద్ధతి.

1 యుక్తమగు పనులను చేయుట
2 సంశయమును బోగొట్టుట
3 శిష్యోపదేశము
4 కనుబొమ్మల నాడించుట
5 ఊహాపోహములు

మొదలైనవి గలుగును.

మతి.

భీభత్సరసమందు బుట్టును.

## 22. నిద్ర

యిందులో 4, 8 సాత్వికభావములుకలవు.

మనస్సు ముకుళించియుండుట:—

వివక్తమందు పరావలోకనచేతను మనస్సు ముకుళితపర్చుకొనుటే.

మందస్వభావము వ్యాయామము నిశ్చింతత సమాధి వీనిచేత గలుగు మనోనిమీలనము నిద్రయనబడును:—

ఇందు

1 ఒళ్ళు విరచుకొనుట
2 ఆవలించుట
3 కన్నులు మూయుట
4 పైటచెంగుగాని కొప్పుగాని ధరించిన హారాదులుగాని తొలిగి పోయినప్పటికి తెలియకయుండుట.

5 నిద్రిలో ఒట్టి ఆకాశమును కావిలించుకొనుట అనగా స్వప్న మందు ప్రియుణ్ని చూచి చుంబనాలింగనాదులు తాను జరిగించుతున్న ట్టు కనపర్చుట.

పరివకపద్ధతి.

1 ముఖగౌరవము
2 కన్నులు జలాయించుట
3 అంగముల పరివర్తనము (ఇది 1 సాత్వికభావము)
4 ఉశ్వాస నిశ్వాసములు
5 దేహమందు చెమట పోయుట (2 సాత్వికభావము)
6 నేత్రములు మూతపడుట (3 సాత్వికభావము)
7 దేహసంకోచము
8 తెలివిలేకయుండుట అనగా మూర్ఛ (8 సాత్వికభావము)
ఇవిగలుగును.

నిద్ర.

శృంగారరసమందు; హాస్యరసమందు బుట్టును.

### 23. మోహము; వలపు మూర్ఛ.

ఇందులో 8 సాత్వికభావముగలదు.

మూర్ఛను బొందుటే మోహమనబడును.

సంతోష భయ దుఃఖాను చింతలచేతను మూర్ఛిల్లుట;

ఆపత్తు, భయము, వియోగము మొదలగువానిచే మనస్సున కేమియు తెలియకపోవుట:—

ఇందులో

1 భయపడుతూ మూర్ఛను పొందుట;
2 దుఃఖమును పొందుతూ మూర్ఛను పొందుట;
3 మలయానిలయము చంద్రుడు కోవెలస్వరము చిలకపలుకులు మొదలైనవాటికి తాళలేక మూర్ఛనుపొందుట (ఇది 1 సాత్వికభావము)



N. B. మూర్ఛ అనగా;

1 నిద్రిబొందినవానివలెనుండుట; (ఇది 8 సాత్వికభావము)
2 గుడ్లుతేలవేయుట
3 శరీరము పడిపోవుట
4 కళ్ళు మూసుకుని తల వాళ్ళు త్రిప్పుట.

దేహము మరచియుండుట; సొక్కియుండుట.

పరివకపద్ధతి.

1 ఇంద్రియములు శూన్యముగనుండుట;
2 చేష్టలులేకయుండుట; (ఇది 1 సాత్వికభావము) చేష్టఅనగా కాలు చెయ్యి మొదలైనవి కదలుట
3 దేహమువిరుగుట
4 పడుట
5 గుడ్లు గిరగిరలాడుట (ఇవిమొదలైనక్రియలు గలుగును)

మోహము.

అద్భుతరసమందును వీరరసమందును బుట్టును.

### 24. విబోధము, బోధము; ప్రబోధము.

ఎరుకను బొందియుండుట.

ఆత్మా మనస్సు సంయోగమై ఆవలింతలతోగూడా కళ్ళు నలుపుకుంటూ మేలుకొనుట విబోధమనబడును.

నిదుర మేలుకొనుటే విబోధమనబడును.

ఇందు

1 భుజములు పైకి ఆడించుట;
2 చిటికలువేయుట;
3 వొళ్లు విరచుకొనుట
4 కన్నులు నలుచుకొనుట
5 కన్నులు క్రమముగ విప్పుట
6 ఆవలింతలు ;

ఇవిమొదలైనవి గలుగును.

పరివకపద్ధతి.

1 కన్నులు నలుపుకొనుట (4 సాత్వికభావం)
2 పడకనువిడుచుట
3 బాహువిక్షేపము
4 అంగులిమోటకము
5. తలగోక్కొనుట
6 దేహమును ద్రిప్పుట మొదలైనవిగలుగును.

విబోధము.

వీరరసమందుఁబుట్టును.

25. మృతి మరణం, అంతం, చావు.

శరీరత్యాగం (ఇందులో 5 సాత్త్వికభావము కలదు)

మరణమును పొందుట అంతమనబడును;
శరీరత్యాగమే మరణమనబడును.

సర్వాంగవ్యాపిగానుండు ధనుంజయువుయొక్క నిర్గమము మరణమనబడును.

ఇందు

1 ఎక్కిళ్ళు తెచ్చుకొనుట;
2 శ్వాసలుతెచ్చుకొనుట;
3 వెన్నెల సేవచేయుట;
4 మలయమారుతమునకు శరీరము అర్పించుట
ఇవి మొదలైనవి గలుగును.

ఈమరణము రెండువిధములు.

1 వ్యాధిజమనియు, 2 అభిఘాతజమనియు; ఇరుదెరగులౌను.

1 వ్యాధిజమరణం యథా.

అసాధ్యమయిన హృద్రోగము విషూచి మొదలైనవానిచేత గలుగును. వ్యాధిజమరణమందు:—

1 కొతుకుచు మాటలాడుట;
2 దేహకాంతి మారిపోవుట;
3 మెల్లగా శ్వాసమువిడుచుట;
4 మాటనిలిచిపోవుట;
5 నేత్రమీలనము;
6 హిక్క—అనగా ఎక్కిళ్ళు;
7 పరిజనముల నుపేక్షించుట;
8 ఇంద్రియచేష్టలణుగుట;
మొదలైనవి గలుగును.

2 అభిఘాతజమరణం యథా.

ఘాతము, పడుట, దేహబంధనము, విషము వీనిచేగలుగునది యభిఘాతజ మరణమనబడును.

N. B. అందు ఘాతజమందు.



1 నేలబడుట
2 ఏడ్చుట
మొదలైనవిగలుగును.

వసనాభి మొదలైన విషము పతనాదులయిన అభిఘాతమువలన గలుగుచేష్టలు.

1 చిక్కిపోవుట
2 వణకుట (ఇది 2 సాత్త్వికభావము)
3 తాపము
4 హిక్క
5 ఫేనము
6 కంధరాభంగము;కంధరము అనగా కంఠము.
7 జడత అనగా వొడలుమరచుట
8 మరణము
మొదలైన చేష్టలు గలుగును.

మృతి.

భయానకరసమందును వీరరసమందును శృంగారరసమందును బుట్టును.

26. ముదము, హర్షము.

ఇందులో 2, 3 సాత్త్వికభావములుగలవు.

ఇష్టమయిన పదార్థముయొక్క లాభమువల్లబుట్టిన సంతోషము ముదమనబడును.

హర్షస్వేదకంపములచేత వుత్సాహప్రసక్తే హర్షమనబడును.
మనోరథము యొక్కసిద్ధి యోగ్యమయిన వస్తువుయొక్క లాభముచేతను మిత్రుల సంగమముచేతను దేవతాదుల ప్రసాదముచేతను గలిగింపబడిన మనఃప్రసాదము హర్షమనబడును.

గురువు యొక్కయు దేవతయొక్కయు రాజుయొక్కయు ననుగ్రహమువలనను ప్రియసంగమమువలనను కోరబడినవస్తువు లభించుట వలననుగలుగు మనోవికాసము హర్షమని లక్షణం.

1 ముఖనేత్రములు వికాసచేతను;
2 ప్రియపుమాటలు వినుటచేతను;
3 పులకలు పుట్టుటచేతను.

4 గాత్రము బుక్కుటచేతను.

5 చెమటచేతను, తెలియబడునని లక్షణము.

ఇందు

1 కన్నులయందున్ను ముఖమందున్ను వికాసము కనపర్చుట (ఇది 1 సాత్వికభావము.)

2 వ్రాల్లు గరిపొడుచుటను (ఇది 3 సాత్వికభావము.)

3 శరీరము పుప్పొంగించుటను (ఇది 4 సాత్వికభావము.)

4 కళ్ళు ముఖముగాక యితరస్థలములయందు చెమటకలిగి యున్నట్టుకనపర్చుట (ఇది 5 సాత్వికభావము)

ఇందు

1 ముఖము కన్నులు వికసించుట (ఇది 1 సాత్వికభావము)

2 ప్రియభాషణము (ఇది 2 సాత్వికభావము)

3 ఆశ్లేషము:—

4 పులకరింపు (ఇది 3 సాత్వికభావము.)

5 చెమటగలుగుట (ఇది 2 సాత్వికభావము)

6 చేతులు తట్టుట; మొదలైనవిగలుగును.

ముదము.

అద్భుతరసమందును వీరరసమందును రౌద్రరసమందునుబుట్టును.

## 27. ఆలస్యము మాంద్యము జాగు, అరతి.

చేయదగిన కార్యమందు మందకొడిగల యుద్యోగము;

చేయవలసిన కార్యములయందు మందపడుటే ఆలస్యమన బడును.

ఆలస్యమనగా మాంద్యము జాగు.

స్వభావము భయము తృప్తి గర్వము భయములేకయుండుట మొదలగు వానివలన విళంబనముగ పనులను యత్నించుట ఆలస్యమనబడును.



ఇందు

1 వ్రాల్లు విరచుకోవడము;

2 ఆవలించడము.

3 కార్యము చేయుటయందు బద్ధకము కనపర్చుట;

4 పడకటింటిలో సువాసనరచన; చాందినీకట్టుట.

5 కస్తూరి పూసుకొనుట.

6 పువ్వులు ముడుచుకొనుట లేక దండలు మెడలోవేసుకొనుట.

7 మకరికాపత్రములను రచించుట.

యీమొదలైన వాటియందలి యత్నముయొక్క మాంద్యమును కనపర్చుట.

N. B. 2 వ సంచారియైన శ్రమయందు వ్రాయబడిన వాటిచేతనున్ను, 10 వ సంచారియగు గర్వముయందు వ్రాయబడిన వాటిచేతనున్ను కూడా పట్టవలెను.

మరియొకపద్ధతి.

1 అంగభంగము;

2 క్రియాద్వేషము;

3 ఆవలింత (ఇది 2 సాత్వికము);

4 నేత్రములు నలుపుట;

5 పండుకొనుటయందు ముఖ్యముగా ప్రియముగలుగుట;

6 కూర్చుండుటయందు ముఖ్యముగా ప్రియముగలుగుట

7 కన్నులు మూతలు పడుట

8 నిదురమొదలైన క్రియలు గలుగును.

ఆలస్యము;

శృంగారరసమందును అద్భుతరసమందును కరుణారసమందు పుట్టును.

## 28. వితర్కము, సంశయము, ఊహ.

సందేహముచేత అనంతములయిన్న కల్పనలు గలుగుట.

సందేహమువల్ల అనేక విధములుగా కల్పించుట వితర్కమనబడును.

సందేహము నిశ్చయము మొదలైనవానిచేగలుగు ఊహాత్మకము సత్యాసత్యనిర్ణయము వితర్కమనబడును.

దీనియందు

1 కనుబొమలు ఎగరవేయుట }
2 తల యాడించుట } మొదలైన యనుభావములుగలుగును.

మఱియొకపద్ధతి.

1 కనుబొమలు మొత్తుట (ఇది 1 సాత్త్వికభావము)
2 తల ముందుకు ఆడించుట(ఇది 2 సాత్త్వికభావము
3 ఆలోచిస్తూ వున్నట్టుకనపర్చుట మొదలైనవిగలుగును.

వితర్కము.

వీరరసమందుఁబుట్టును.

## 28. సుప్తి.

మిక్కిలీనిద్రి సుప్తియనబడును.
స్వప్నములేని నిద్రి సుప్తి.
నిదురయొక్క ఆధిక్యమే సుప్తి.

ఇందు.

1 వుశ్వాసనిశ్వాసలు కనుపర్చుట
2 ఇంద్రియములయందు నిశ్చలత్వమును కనపర్చుట:—
3 కన్నులు మూసుకొనుట.

మఱియొకపద్ధతి

1 ఇంద్రియములు ఉపరతిని బొంది యుండుట (ఇది 2 సాత్త్వికభావము)
2 కన్నులు మూసియుండుట (ఇది 3 సాత్త్వికభావము)
3 గాత్రము స్రస్తమైయుంపుట
4 కలగనుట
5 దీర్ఘ కాలము కదలక యుండుట.
6 ఉశ్వాస నిశ్వాసములు (1 సాత్త్వికభావము) మొదలైనవిగలుగును.



సుప్తి

హాస్యరసమందుబుట్టును.

## 30. అసూయ; ఈర్ష్య; అసహ్యత.

పరులయొక్క అతిశయమును సహించక పోవుట ఈర్ష్యయనబడును.

పరులయొక్క వుచ్ఛ్రియమును సహించకుండుటే అసూయ. అసూయఅనగా ఓర్వలేనితనము.

ఇతరుల సౌభాగ్యము సంపత్తి విద్య కులము శౌర్యముమొదలగు హేతువులచే గుణమందుగూడ దోషారోపణజేయుట అసూయయనబడును.

ఇందు

1 మోమునుద్రిప్పుట
2 నిందించుట
3 భ్రూభేదము
4 ఉపేక్ష
ఇవిమొదలగు క్రియలు గలుగును

మఱియొకపద్ధతి

1 గర్వము (1 సాత్త్వికభావము)
2 దౌర్జన్యము
3 కోపము
వీటివల్ల యితరోత్కర్షను సహింపకపోవుట
4 నిందించుట (2సాత్త్వికభావము)
5 తిరస్కరించుట (4 సాత్త్వికభావము)
6 బొమముడివేయుట; అనగా కనుబొమలు ముఖము లేక నొసలు చిట్లించుట (3 సాత్త్వికభావము)

ఈర్ష్యానుగుణాల్పనైనను సహింపకపోవుట.

అసూయ

వీరరసమందును రౌద్రరసమందును శృంగారరసమందు హాస్యరసమందును బుట్టును.

### 31. ఆధ్యానము, చింత.

ఇష్టమయిన వస్తువు చేకూరకపోయినప్పుడు మిక్కిలి చింతించుట ఆధ్యానమనబడును.

ప్రియవస్తువులు లభింపనందువలన ఐశ్వర్యభ్రంశనము మొదలైనవానిచేత గలుగు ధ్యానము చింతయనబడును.

ఇందు.

1 మేనుచిక్కుట
2 తలవంపు; అనగా అవమానము
3 సంతాపము; అనగా తాపము
4 నిట్టూర్పు మొదలైనవి గలుగును.

మరియొక పుస్తకము

1 శూన్యత్వము అనగా లభించకపోవడము.
2 నిశ్వాసములు అనగా నిట్టూర్పులు (4 సాత్విక భావము)
3 తాపము (ఇది 3 సాత్విక భావము)

ఆధ్యానము

కరుణారసమందును శృంగారరసమందును భయానకరసమందును బుట్టును.

### 32. ఉన్మాదము.

విస్మయము; భ్రమ; చిత్తవిభ్రమ; ఇదిదశావస్థలులోది ఉన్మాదమనగా వెఱ్ఱితనము

ఎల్లప్పుడు చేతనవస్తువులయందు అచేతనవస్తువులయందు సమానమైన మనస్సుయందు భ్రమపడుట ఉన్మాదమనబడును.

స్థావరజంగమాదులయందు సమత జెందుటే ఉన్మాదము.

ఉన్మాదమనగా చిత్తవిభ్రమ; వెఱ్ఱితనము.

వియోగము ఇష్టనాశనము వీనివలనగలుగు చిత్తవిభ్రమము.



ఇందు.

1 నిమిత్తములేనినవ్వు
2 సంబంధములేనివాగుడు
3 హేతువులేకుండా పరుగెత్తుట
4 కూర్చుండుట
5 లేచుట
6 ఏడ్చుట
7 జీవనముగల మనుష్య పశు పక్ష్యాదులయందున్న జీవము లేని చెట్లు గుట్లు మొదలైన వాటియందున్న సమముగా ప్రవర్తించుట అనగా గోడతోటి మనుష్యులతోటి సమానముగా మాట్లాడుట

ఉన్మాదము రెండువిధములు.

1 వియోగజోన్మాదమనియు 2 ఇష్టనాశోన్మాదమనియును.

వియోగజోన్మాదమందు

1 పరుగెత్తుట (ఇది 3 సాత్విక భావము)
2 పరిదేవనము అనగా విలపించుట అనగా తలచుక తలచుక ఏడ్చుట
3 సంబంధములేని పలుకులు పలుకుట
4 పండుకొనియుండుట
5 త్వరగా లేచుట
6 ప్రాణములేనివానితో మాట్లాడుట
7 కారణములేకనవ్వుట మొదలైనవి గలుగును

2 ఇష్టనాశోన్మాదమందు

1 భస్మము మొదలైనవానిని బూసుకొనుట
2 నృత్తము గీతము మొదలైనవి జేయుట
3 తృణము మొదలైనవానిదండలను ధరించుట

ఇవియును; వియోగజోన్మాదమందుగలుగు క్రియలును గలుగును.

ఉన్మాదము

కరుణారసమందును హాస్యరసమందును బుట్టును.

### 33. అపస్మృతి, అపస్మారము.

ఇందులో 1, 5 సాత్విక భావములు కలవు.

ఇంద్రియములయొక్క చలనము అపస్మారమనబడును;

మోహమూర్ఛలచేతను తనుతాపకారేణ ఆవేశమే అపస్మృతి లేక అపస్మారమనబడును.

వాత, పిత్త శ్లేష్మ ధాతువులహెచ్చు తక్కువ దోషము దయ్యము సోకుట మొదలైనవానిచేత జేయబడిన మనస్సుయొక్క క్షోభము అపస్మృతి, లేక అపస్మారమనఁబడును.

ఇంకు

1 వణకుట (ఇది 5 సాత్వికభావము)
2 పరుగెత్తుట
3 పడుట
4 స్తంభము అనగాకదలకుండుట (ఇది 1 సాత్వికభావము)
5 తిరుగుట
6 నేత్రముల విక్రియ
7 స్ఫోటము
8 పండ్లుకొరుకుట
9 చేతులు విసరుట
10 నోట జొల్లుకార్చుట (5 సాత్వికభావము)
11 నురుగు గలుగుట (5 సాత్వికభావము)
మొదలైనవిగలుగును.

మరియొక పద్ధతి

1 భూమియందుపడుట (3 సాత్వికభావము)
2 తిరుగుట (5 సాత్వికభావము)
3 దండచెయ్యి చరుచుకొనుట
4 వెఱ్ఱిమాటలాడుట
5 చొంగ నురుగు నోటివెంట తెచ్చుకొనుట
6 వెఱ్ఱిచూపుచూచుట
7 పరుగెత్తుట (2 సాత్వికభావము)
8 చిందులు ద్రొక్కుట
9 వూగిసలాడుట
యీమొదలైనవి గలుగును.

అపస్మృతి.

భయానకరసమందును భీభత్సరసమందును బుట్టును.

శా. నిర్వేదశ్రమదైన్యజాడ్యములుగానీ త్రాసశంకాతిరు
గ్గర్వావేగ ధృతిస్మృతుల్చపలతోగ్రత్వావహిత్థాత్రపాం
తశ్రైవ్లక్ష్యమదోత్సుకత్వమతి నిద్రామోహబోధాంతము
త్సర్వాలస్యవితర్కసుప్త్యసహతా ధ్యానభ్రమాపస్మృతుల్.



శ్లో. నిర్వేదగ్లానిశంకాఖ్యా । స్తథాసూయామదశ్రమః
ఆలస్యంచైవదైన్యంచ । చింతామోహస్మృతిర్ధృతిః
వ్రీడాచపలతాహర్ష । ఆవేగ జడతాతథా
గర్వోవిషాదమౌత్సుక్యం । నిద్రాపస్మారఏవచ
సుప్తిర్విబోధామర్షశ్చ । వ్యవహిత్థాతతోగ్రతా
మతిర్వ్యాధిస్తదోన్మాదం । స్తథామరణమేవచ
త్రాసశ్చైవ వితర్కంచ । విజ్ఞేయావ్యభిచారిణః
త్రయస్త్రింశదమీభావా । రసస్యసహకారిణః.

టీక. నిర్వేదము గ్లాని శంక అసూయ మదము శ్రమము ఆలస్యం దైన్యము చింత మోహము స్మృతి ధృతి వ్రీడ చాపల్యము హర్షము ఆవేగము జాడ్యము గర్వము విషాదము ఔత్సుక్యము నిద్ర అపస్మారం సుప్తి విబోధము అమర్షము అవహిత్థ ఉగ్రత మతి వ్యాధి ఉన్మాదము మరణము త్రాసము వితర్కము వ్యభిచారములు యివియని యెరుంగవలయును.

33 సంచారీభావములు.

1 నిర్వేదము,
2 శ్రమము, ప్రయాసము.
3 దైన్యము, దీనత్వము.
4 జడత, వ్యాధి, మాంద్యము.
5 గ్లాని, పీడ.
6 త్రాసము, భయము, సంత్రాసము.
7 శంక, సంశయము,
8 ఆర్తి=జ్వరము, వ్యాధి, రోగము
9 రోషము, అమర్షము క్రోధము
10 గర్వము, దర్పము.
11 ఆవేగము.
12 ధృతి ధైర్యము (ఇది శృంగారచేష్టలలోది కూడా అవుతుంది)
13 స్మృతి; జ్ఞాపకము;
14 చాపలము; చపలత్వము; చాపల్యము; చపలత;
15 ఉగ్రత.
16 అవహిత్థ, అంగగోపన
17 త్రప, వ్రీడ, లజ్జ, సిగ్గు.
18 విషాదము, ఖేదము.
19 మదము;
20 ఔత్సుక్యము; ఉత్సుకత; ఉత్సాహం;

వెన్నెలగాసెర వేడ్కతోగూడర
గ్లాని    మోహం, హర్షం, దైన్యం
పన్నగశయనశ్రీ పార్థసారధియిపు    ॥ఇదిన్యాయమా॥
హర్షం    విషాదం, చింత దైన్యం

N. B. ప్రమాణకములకు పట్టవలసిన భావములు.

1. నీయధరామృతము పానముజేసినట్లు
2. నీచెక్కిలిముద్దాడినట్లు
3. నీమోమును చుంబించినట్లు
4. నిన్ను కౌగలించుకొన్నట్లు

యీభావములు పట్టవలెను.

59. బిలహరి రాగం త్రిపుట తాళము,

నాయిక స్వీయ విరహోత్కంఠిత, సామాన్యప్రౌఢ, శఠుడు, విరహావిప్రలంభశృంగారము, కరుణారసము, అద్భుతరసము, దైన్యము, వితర్కము, శంక, అమర్షము, విషాదము, ధృతి, స్మృతి.

పల్లవి. ఇంతతెలసివుండి యీగుణమేలరా ॥ఇంతతెలసి॥
దైన్యం    వితర్కం, శంక, అమర్షం
అనుప. పంతమాముువ్వగోపాల నాసామిగ ॥ఇంత॥
వితర్కం, శంక, దైన్యం    విషాదం
1. అలుకజేసియింటికి రావైతివినెనరైన
దైన్యం    వితర్కం, శంక, విషాదం
చెలికత్తెలున్నారా పిలువవచ్చేరా
అమర్షం, వితర్కం, వితర్కం, శంక
చెలికత్తెవైననీవే చెలువుడవైననీవే
దైన్యం, ధృతి    విషాదం, ధృతి



తలచిచూడనా పాలిదైవమునీవే ॥ఇంతతెలిసివుండి॥
స్మృతి, దైన్యం, దైన్యం, ధృతి
2. వింతదానివలెనన్ను వేరుజేసిరావైతివి
అసూయ, ధృతి    అమర్షం, విషాదం
అంతరంగులున్నారా నిన్నాదరించేరా
వితర్కం    శంక    అమర్షం, వితర్కం, శంక
అంతరంగమైననీవే నన్నాదరించిననీవే
దైన్యం    ధృతి    దైన్యం    ధృతి
చింతించిచూడనా జీవస్వామివినీవే ॥ఇంతతెలిసివుండి॥
స్మృతి, దైన్యం    ధృతి, దైన్యం, విషాదం
3. శ్రీనిధిమువ్వగోపాల చేపట్టినన్నేలితివి
దైన్యం, విషాదం, హర్షం, ధృతి
నానేర్పులెవరైనా నానందించేరా
దైన్యం, వితర్కం, వితర్కం, శంక
నానేర్పులైనానీవే నమ్మికలిచ్చినానీవే
దైన్యం,    ధృతి,    ధృతి    దైన్యం
యీనగాబల్కెదనా యానందమైననీవే ॥ఇంతతెలిసి॥
ప్రమాణకము, దైన్యం,    దైన్యం, ధృతి, హర్షం

60. సౌరాష్ట్రరాగము, ఆదితాళము.

నాయిక స్వీయ, నవోఢ, విరహోత్కంఠిత, నాయకుడు, పతివిరహ విప్రలంభశృంగారము, కరుణారసము, సఖిపార్శ్వచారిణి, అధాదర్శనము.

వితర్కము, శంక, మోహము, ఆర్తి, నిర్వేదము, చింత, దైన్యము, గ్లాని, ఆవేగము, ఔత్సుక్యము, హర్షం, ధృతి.

పల్లవి. ఇంతివినవే యీరాజశేఖరుండెవఁడో దెలుపరాదటవే ॥ఇం॥

దైన్యం దైన్యం, వితర్కం, శంక వితర్కం, శంక

అనుప. కాంతయీతఁడు బంగారేచధరణీకాంతుఁడో జయంతుఁడో

హర్షం, వితర్కం, శంక వితర్కం, శంక

శ్రీమంతుఁడో ॥ఇంతివినవే॥

శంక, వితర్కం

1. చానవీనినెమ్మోముపున్నమ చందమామచందముమీరు

దైన్యం హర్షం ధృతి

వీనికన్నులువెలితమ్మిరేకుల విధముననలరారు

ఔత్సుక్యం హర్షము, ధృతి

తేనెలొల్కుసుధజిల్కు వీనితేటలైనమాటలసొరు

హర్షం ధృతి హర్షం దైన్యం

వీనిమేనుకాంతులువేమారు కడానిగేరుగదవే

ఔత్సుక్యం నిర్వేదం, ధృతి

నేనేమనిదెలుపుదు యీతనిపెన్నెరులందము

వితర్కం, శంక, శ్వేదం హర్షం, నిర్వేదం

అళిబృందముచందమవును కాను కేసరికేసరియౌ

హర్షం ధృతి ఔత్సుక్యం, ధృతి

ననగదనరుయీచెలువము యువతీమానసశోషణమై

ధృతి హర్షం హర్షం, ధృతి,

కనుగొనుమానవులకు నేత్రోత్సవమైనది ॥ఇంతివినవే॥

ఔత్సుక్యం హర్షము, ధృతి

2. సన్నుతాంగిరొవీనిచూపులు శంబరారితూపులనేలు

దైన్యం హర్షం ధృతి



పొన్నరంట్లనేయూరులూరకే పోపొమ్మనజాలు

హర్షం, నిర్వేదం ధృతి

చెన్నుమీరనలరారువీని చెక్కుటద్దములడాలు

ఔత్సుక్యం హర్షం, ధృతి

వన్నెలాడియితనివీనులు శ్రీవర్ణయుగముగదవే

హర్షం దైన్యం ఔత్సుక్యం, ధృతి

పొన్నమయీతనిపొక్కిలి నవ్వులువెన్నెలతేలిచిన్నెల

హర్షం ధృతి హర్షం ధృతి

వన్నెలకన్నమిన్నకరినెన్నవు నెన్నడవెన్నదగినవో

శంక వితర్కం శంక వితర్కం

కన్నెరోనేనెటు సన్నుతిసేయుదునే

నిర్వేదం చింత దైన్యం, వితర్కం, శంక

గురునకుపన్నగవరునకు నైననువశమా ॥ఇంతివినవే॥

నిర్వేదం చింత గ్లాని, నిర్వేదం

వితర్కం, శంక

3. వనితవీనిసొగసైనరదములు వజ్రమణులకేసరిబోలు

హర్షం ఔత్సుక్యం, ధృతి

వినవేయీతఁడుబంగారేచవిభుడేకాబోలు

దైన్యం ఔత్సుక్యం వితర్కం శంక

వనజనేత్రియిటువంటివాని తనువుగాంచినదేజవరాలు

దైన్యం హర్షం నిర్వేదం ధృతి

కనులుగలిగినందుకుయీ తనిదినదినముజూడవలె

హర్షం ఔత్సుక్యం

ననబోణిరోనన్నలక్రొన్నవిలుతుని కేళినిమది

దైన్యం, ఆవేగం, ఆర్తి, మోహం

బాళినినెనయుమనవే యీతనిపై నామనసు

ఔత్సుక్యం, దైన్యం ఔత్సుక్యం

దగిలియున్నది యీతనిపొందనితనువేమిటికే

హర్షం, ధృతి నిర్వేదం శంక
వితర్కం

మోహముఘనమైయున్నది యికతాళలేనే ॥ఇంతివినవే॥

మోహం, ఔత్సుక్యం నిర్వేదం, గ్లాని, ఆవేగం
ఆర్తి చింత, నిర్వేదం

N. B. త్రిప, ఆధ్యానము, ఔత్సుక్యం, పదమంతటా యున్నది.

61. యదుకుల కాంభోజిరాగం, త్రిపుటతాళం.

---

నాయిక, పరకీయ, విరహోత్కంఠిత, నాయకుడు శఠుడు, విరహావిప్రలంభశృంగారము, కరుణారసము.

దైన్యము, వితర్కము, విషాదము, ఉగ్రత, ఔత్సుక్యము, త్రాసము, గ్లాని, ఆర్తి, ఉన్మాదము, అసూయ, ముదము, స్మృతి, చింత, నిర్వేదము, మోహము, ధృతి, వేపథు, ఆలస్యము, పశ్చాత్తాపము, శంక.

పల్లవి. ఎంతనివేడిన చెంతజేరకున్నావు ఇంతకోపమేలరా

దైన్యం, వితర్కం విషాదం, వితర్కం ఉగ్రత, వితర్కం, శంక
దైన్యం

అనుప. రంతుకాడ కాంచిరంగేంద్రునికుమార రారాయుడరంగా

దైన్యం ముదము ఔత్సుక్యం

యీరాపులేలరా ॥ఎంతవేడిన॥

విషాదం, వితర్కం, శంక,



1. కన్నులువిల్లుకాని ఘనబాణజాలముల

దైన్యం త్రాసము, వేపథు
ఉగ్రత

కరిగినేనిట్లుండగా సామియిన్నాళ్లదాక

గ్లాని, ఆర్తి ఆలస్యం, దైన్యం, వితర్కం

నను బాసియుండుట నీకెట్లుమదిదోచెరా

ఔత్సుక్యం, మోహం వితర్కం, శంక, విషాదం

నిన్ననేటివారునీకు ప్రియమైనారా

అసూయ, నిర్వేదం ముదము, చింత, వితర్కం

సిన్ననపనిలేదు ఆనెలతస్నేయుమాటలకు ॥ఎంతని॥

పశ్చాత్తాపం, నిర్వేదం అసూయ దైన్యం
వితర్కం విషాదం

2. బలిమినిపిలిపించుక వచ్చినపుడెలెస్సతెలిసెరా

ఉగ్రతి, ముదము ముదము, స్మృతి, విషాదం

నీజాడలువల్లశివలనైతే పలుకేబంగారమా

ఔత్సుక్యం నిర్వేదం, వితర్కం

వన్నెకాడయిపుడుకలనైన నీమాటగడిచినానటరా

దైన్యం, విషాదం ఔత్సుక్యం, విషాదం, వితర్కం

చలముసేయకరారా సామియిక తాళలేనురా ॥ఎంతని॥

ఆలస్యం, ఔత్సుక్యం గ్లాని, చింత, మోహం
దైన్యం ఔత్సుక్యం, విషాదము

3. ఇదివరకునినుబాసి యెన్నోబాములజెందితి

స్మృతి, విషాదం గ్లాని, ఆర్తి, త్రాసము, ధృతి

యేమితోచకనుంటిరా సదయరారా
చింత, ఉన్మాదం, ధృతి    ఔత్సుక్యం, దైన్యం
నీమనసారమెప్పటివలెనే జాగుసేయనేలరా
ముదము, స్మృతి, ధృతి    ఆలస్యం, ఔత్సుకం
దైన్యం
అదనమునినీపై ఆశరెట్టించెరా
గ్లాని, ముదము    మోహం, ధృతి
మదనావతారనీ మదిరానడతురా ॥ఎంతని॥
ముదము, దైన్యం    నిర్వేదం, ధృతి, విషాదం
దైన్యం

### 62. యదుకుల కాంభోజిరాగం, త్రిపుటతాళము.

---

నాయికస్వీయ, విరహోత్కంఠిత, నాయకుడు, పతి విరహవిప్రలంభశృంగారము, మధురకథాదూతి, అనగాఅటహా చతుర, కరుణారసము.

ఔత్సుక్యము, చింత, మోహము, నిర్వేదము, ప్రబోధము, ధృతి, త్రాసము, దైన్యము, ఆర్తి, గ్లాని, అశ్రువులు, స్వేదము, వితర్కము, శంక.

పల్లవి. ఏమాటలాడిన నీమాటలేగాని ఎన్ని జెప్పిన నెదురాడదురా
ఔత్సుకం,    ధృతి    చింత, నిర్వేదం, ధృతి
అనుప. తామరసాక్షనీ వెపుడువత్తువోయని
ఔత్సుక్యం    చింత    వితర్కం, శంక
తలవాకిల్లింగా నిలచియున్నదిరా ॥ఏమాట॥
నిర్వేదం    నిర్వేదం, చింత, దైన్యం



1. కనులకాటుకనీరు కాల్వలైపారెరా
నిర్వేదం, అశ్రువులు    నిర్వేదం, చింత,
కాంతవిరహాగ్నిని కనగూడదురా
ఆర్తి, ఆవేగం    నిర్వేదం, చింత, గ్లాని
నిన్నెడబాసిఅర నిముసమోర్వదురా
ఔత్సుక్యం,    ఆలస్యము, మోహం, చింత
ధృతి
వన్నెకాడ మోరీ వలదనరాదురా ॥ఏమాటలాడిన॥
ఔత్సుకం    దైన్యం, ధృతి

2. మనసుకింపైనసొమ్ము నుదాల్చదురసామి
విషాదం, ముదము    నిర్వేదం, చింత, ధృతి
ఘనమైనవిలువకో కలనుగట్టదురా
ముదము    నిర్వేదం, ధృతి
తనకున్న హారమున కున్నైనలేవదురా
ముదము, వితర్కం    విషాదం, చింత, ధృతి
తనవారితోగూడి తడపాడవెరచుర ॥ఏమాటలాడిన॥
ముదము    త్రాసము, దైన్యం

3. సొగసుగుబ్బలనున్న ముత్యపుసరులెల్ల
ఔత్సుక్యం, ముదము    ముదము
సెగయింపుచెమటచే సున్నమయ్యెనురా
ఆర్తి, స్వేదం    గ్లాని, చింత, ధృతి
మగువతెగువజూచి మానినిపొందుదలచి
ముదము, దైన్యం    ఔత్సుక్యం, ధృతి
వగకాడశ్రీరాజగోపాలసుశీల ॥ఏమాటలాడిన॥
ఔత్సుక్యం    విషాదం, దైన్యం

యేమిటోచకనుంటిరా సదయరారా

చింత, ఉన్మాదం, ధృతి   ఔత్సుక్యం, దైన్యం

నీమనసారమెప్పటివలెనే జాగుసేయనేలరా

ముదము, స్మృతి, ధృతి   ఆలస్యం, ఔత్సుకం

దైన్యం

అదనముననీపై ఆశరెట్టించెరా

గ్లాని, ముదము   మోహం, ధృతి

మదనావతారనీ మదిరానడతురా ॥ఎంతని॥

ముదము, దైన్యం   నిర్వేదం, ధృతి, విషాదం

దైన్యం

62. యదుకుల కాంభోజిరాగం, త్రిపుటతాళము.

---

నాయిక స్వీయ, విరహోత్కంఠిత, నాయకుడు, పతి

విరహవిప్రలంభశృంగారము, మధురకథాదూతి, అనగాఅటహాచతుర, కరుణారసము.

ఔత్సుక్యము, చింత, మోహము, నిర్వేదము, ప్రబోధము, ధృతి, త్రాసము, దైన్యము, ఆర్తి, గ్లాని, అశ్రువులు, స్వేదము, వితర్కము, శంక.

పల్లవి. ఏమాటలాడిన నీమాటలేగాని ఎన్నిజెప్పిన నెదురాడదురా

ఔత్సుకం,   ధృతి   చింత, నిర్వేదం, ధృతి

అనుప. తామరసాక్షనీ వెపుడువత్తువోయని

ఔత్సుక్యం   చింత   వితర్కం, శంక

తలవాకిల్లిగా నిలచియున్నదిరా ॥ఏమాట॥

నిర్వేదం   నిర్వేదం, చింత, దైన్యం



2. పగలెల్లనేనునీ వగమొగమేజూచుకుని

నిర్వేదం   స్మృతి, దైన్యం, విషాదం

దిగులులేకుందునమ్మా వగనొందిరేయల్ల

ఆర్తి, ధృతి, గ్లాని   విషాదం, ధృతి

చిగురుపానుపుమీద వుసుసురందునమ్మా

మోహం, దైన్యం   గ్లాని, విషాదం, ధృతి

మగనిచిత్తమురాని మగువలెట్లోర్తురో

ఔత్సుక్యం, దైన్యం   ఆధ్యానం, నిర్వేదం, వితర్కం, శంక

గగనమైనతపము కడతేరదాయెనేనింక ॥ఏటిబ్రతుకు॥

ఉగ్రత, పూజ   నిర్వేదం, వితర్కం, ఆధ్యానం

శకం

3. నావంటిదానికే నలినాక్షయీపట్ల

దైన్యం, స్మృతి   చింత, నిర్వేదం

దైవమెక్కడయుండునో నీవేనేనేయనుచు

ఆధ్యానం, వితర్కం, శంక   స్మృతి, ముదం, ధృతి

విభుడురాకున్నంత నావిభవమెట్లుండునో

మోహం, ఔత్సుక్యం, వితర్కం   గ్లాని, వితర్కం, శంక

భావమునమామువ్వ గోపాలుతోగూడిన

దైన్యం   ఔత్సుక్యం

యేప్రొద్దుమరుపు వేయుదునింకనేమి ॥ఏటిబ్రతుకు॥

నిర్వేదం, స్మృతి   విషాదం, చింత, వితర్కం

ఔత్సుక్యం, శంక

ఆలస్యం

## 64. ఫరజురాగం, ఆదితాళము.

నాయిక పరకీయ, ప్రౌఢ, విరహోత్కంఠిత, నాయకుడు, శఠుడు, వియోగవిప్రలంభశృంగారము, కరుణారసము.

ఔత్సుక్యము, ఆవేగము, వితర్కము, విషాదము, ముదము, శ్రమ, దైన్యము, శంక, ప్రమాణికములు, వ్రీడ.

పల్లవి. ఏమనె నేసుద్దులేమే బంగారుబొమ్మ ॥ఏమనె॥
వితర్కం, ఔత్సుక్యం, విషాదం, దైన్యం
శంక ఆవేగం

అనుప. మరుగేలదాచకే రామతుపాకుల రాయుడునీతో ॥ఏమనె॥
దైన్యం, విషాదం దైన్యం ముదము, శంక

1. మానినిముందుగానా మాటనీవొత్తితివో
ఔత్సుక్యం ఆవేగం శంక
వితర్కం
తానేబల్కరించెనో దయనాపై దగిలి
శంక వితర్కం ముదము
కానుకతనచేత బూనెనోయందిమ్మని
ఔత్సుక్యం శంక, వితర్కం, విషాదం
యానతిచ్చెనోనామీ దానయోచెలియ ॥ఏమనె॥
శంక, వితర్కం ప్రమాణకము విషాదం, దైన్యం

2. వనితరోవానిధాను వచ్చెదననెనోలేక
దైన్యం ఆవేగం వితర్కం, శంక
నన్నుతోడితెమ్మనెనో నాప్రాణవిభుడు
దైన్యం, వితర్కం, శంక దైన్యం, విషాదం



నెనరుతో మాటాడెనో నేరమంచెనోలేక
ముదము, వితర్కం, శంక విషాదం, వితర్కం, శంక
వినిపింపువానిమాట వినముచ్చటయ్యెనే ॥ఏమనె॥
ఔత్సుక్యం, దైన్యం, ఆవేగం, ముదము, దైన్యం

3. వేడకతుపాకుల వెంకటకృష్ణుడు
దైన్యం దైన్యం
గూడేవేళలోనే నోడించితినంట
ఔత్సుక్యం శ్రమ విషాదం
నేడాసుద్దులేమైనా నీతో మందలించెనో
వ్రీడ వితర్కం విషాదం, వితర్కం, శంక
మోడిగనున్నాడో ముదితరోవినవే ॥ఏమనె॥
వితర్కం, శంక దైన్యం, విషాదం

## 65. సురంజిరాగం. త్రిపుటతాళం.

నాయికపరకీయ, విరహోత్కంఠిత, అన్యసంభోగదుఃఖిత, నాయకుడు శఠుడు, విరహవిప్రలంభశృంగారము, కరుణారసము, స్మృతి, చింత, గ్లాని, అసూయ, దైన్యము, మోహము. ఆర్తి, నిర్వేదము. శంక, వితర్కము, శ్రమ, విషాదము, ఔత్సుక్యము, రతులు, ఆవేగము, ధృతి, ముదము.

పల్లవి. తలచుకుంటే తాళజాలనే ఆడదానిజన్మమికచాలునే॥
స్మృతి, చింత, గ్లాని, మోహం, అసూయ, నిర్వేదం, దైన్యం
దైన్యం

అనుప. లలనావానికిసతమాయెనే కైలాసపతిందురాడాయెనే ॥తలచు॥
దైన్యం అసూయ దైన్యం, మోహం, శంక
నిర్వేదం చింత, విషాదం, వితర్కం

1. సుగుణప్రియతో చేరవచ్చెనే ఆకుమడుపుపంటనొక్కెచ్చెనే
అసూయ, ఆవేగం, మోహం, దైన్యం, నిర్వేదం, అసూయ, చింత

సొగసుకెమ్మోవియానిచ్చెనే వానిచూడచూడగతమిహెచ్చెనే

మోహం విషాదం, ధృతి ఔత్సుక్యం మోహం, ధృతి

బాముకరానివలపాయెనే నాపతికింతదయలేకపోయెనే

శ్రమ మోహం ఔత్సుక్యం, దైన్యం, చింత విషాదం

కాయజునిరాపాయెనే యాకలికివానికిసతమాయెనే ॥తలచు॥

గ్లాని, శ్రమ, మోహం అసూయ, విషాదం, చింత, ధృతి ఆర్తి

2. దొరలవలపులేటిసతములే అవిదొరికేవితొలినోముఫలములే

మోహం, వితర్కం, శంక ఔత్సుక్యం నిర్వేదం, చింత ధృతి

తిరుగనేచుటవారిమతములే అవిదెలిపెదనంటేభారతములే

శ్రమ, ఆర్తి, నిర్వేదం, ధృతి, దైన్యం, వితర్కం, నిర్వేదం చింత

అలిగిరాడేమినేతునే యమ్మలారనా వలపెటుదాతునే

చింత, విషాదం, వితర్కం, శంక, దైన్యం, మోహం, వితర్కం, విషాదము శంక

వెలదియీదినమెట్లుద్రోతునే ప్రాణవిభునికెన్నికమ్మలువ్రాతునే॥

అసూయ, వితర్కం, శంక, చింత, ఔత్సుక్యం, వితర్కం, శంక, విషాదం చింత

3. హాయలుమీరినవిరితోటలో మంచియొదపైనబంగారుమేడలో

ముదము ఔత్సుక్యం ముదము ఔత్సుక్యం

నయముమీరకైలాసపతి నన్నుగూడెనె యానలినాక్షితిరుగ

ముదము ఔత్సుక్యం రతులు అసూయ ధృతి

బెరడ్లాడెనే ॥తలచుకుంటే తాళజాలనే॥

నిర్వేదం, ముదము, దైన్యం ధృతి



## 66. నాటకురంజిరాగము, ఆదితాళము.

---

నాయికస్వీయ, మధ్య, విరహోత్కంఠిత, విరహావిప్రలంభశృంగారము, అద్భుతరసము.

చింత, శంక, వితర్కము, అసూయ, నిర్వేదము, దైన్యము, గ్లాని, హర్షము, రతివిశేషములు.

పల్లవి. పేరుబడమన్నారురంగనికి పెండ్లిసేయుటెన్నటికోతెలియదు॥

దైన్యం, హర్షం చింత, శంక, నిర్వేదం, దైన్యం

అనుప. ధరణిధొరలిండ్లనుబుట్టుట పగవారికైనగోరగాదమ్మా ॥పెం॥

హర్షం, వితర్కం అసూయ, గ్లాని, నిర్వేదం

1. తల్లిదండ్రులమతిచేకొన్నాళ్ళు తలచుకుతరిజూచుచుకొన్నాళ్ళు

చింత, అసూయ, నిర్వేదం, వితర్కం, హర్షం, చింత, నిర్వేదం

కులధర్మములువిచారించుకో వలెనంచుకొన్నాళ్ళు

హర్షం, అసూయ, వితర్కం, హర్షం, నిర్వేదం

అలరుపాయములు పరిమెళపువిరులు విధమాయగా

నిర్వేదం అసూయ, వితర్కం, నిర్వేదం

విధిమాయగా యీధరణి పేరుబడమన్నారురంగని ॥పేరు॥

వితర్కం, చింత, శంక, నిర్వేదం

2. మగనిసుఖమెరుగకకొన్నాళ్ళు మరియాదలకొరకైకొన్నాళ్ళు

చింత, అసూయ, శంక దైన్యము, శంక, వితర్కం, చింత

నగరివారమనేటిబింకముల నాణెంబులువెదకుచుకొన్నాళ్ళు

చింత, శంక, దైన్యం దైన్యం, శంక, వితర్కం, చింత

పొగరుతమకమడవిగాయువెన్నెల పోలికతుదజాలికయ్యెనిది

చింత, హర్షం, గ్లాని, అసూయ నిర్వేదం, చింత, అసూయ

3\. వచారుతోచితోచకకొన్నాళ్ళు అనుభవవిధమెరుగకకొన్నాళ్ళు
చింత, శంక, వితర్కం, అసూయ నిర్వేదం, దైన్యం, విషాదం
సరసముగారతికేళిముచ్చటలు సఖియలచేచాలావినికొన్నాళ్ళు
రతివిశేషములు, నిర్వేదం, చింత దైన్యం, హర్షం, నిర్వేదం
అపురఆడతనమేపగజేసెదై అలసితినే సొలసితినే ॥వేరు॥
శంక, వితర్కం, అసూయ, చింత, నిర్వేదం, శ్రమ, చింత, గ్లాని, విషాదం

67\. రేగుప్తి రాగము, త్రిపుటతాళము.

---

నాయికస్వీయ, విరహోత్కంఠిత, నాయకుడు శఠుడు, సఖి పార్శ్వచారిణి, విరహవిప్రలంభశృంగారము, కరుణారసము.

దైన్యము, చింత, ఔత్సుక్యము, ముదము, ధృతి, స్మృతి అసూయ, శ్రమ, విషాదము, వితర్కము, విబోధము, గ్లాని, నిర్వేదము, ఆర్తి, ఆలస్యము, త్రాసము, మోహము, ఆవేగము.

పల్లవి. బోటిరోవానిననుగూర్చితేనీకు కోటివరహాలైనయిస్తునే ॥బో॥
దైన్యం, చింత, ఔత్సుక్యం ముదము, దైన్యం, ధృతి

అనుప. సాటిలేనినృపకోటిలోమేటియౌ వెలుగోటిబంగారేచేంద్ర
ఔత్సుక్యం, ధృతి, దైన్యం
కిరీటిపైమదినాటియున్నది ॥బోటిరో॥
మోహం, ముదము, చింత, ధృతి

1\. చిన్ననాడెవాడు నన్నుచేపట్టి మిన్నగానుకలసి మెలసియున్నట్టి,
దైన్యం, ముదము, చింత, స్మృతి, ధృతి ముదము
చిన్నెలన్నిజూచి యిప్పుడుచలపట్టి
ఔత్సుక్యం గ్లాని, ధృతి



వన్నెలాడివానికెన్నెన్నోబోధించెనే
అసూయ, విషాదం, వితర్కం, దైన్యం
అతడునిన్నదానిగారవించెనే అదినన్నుమించెనే వలపించెనే
అసూయ, చింత, ధృతి అసూయ, ధృతి శ్రమ, విషాదం
నన్నుతాంగిరోయేమిసేయుదునే ఇకయెన్నటికినాసామినిబిగి
దైన్యం, వితర్కం, విషాదం, చింత ఆలస్యం, వితర్కం, శంక
కౌగిటికిడాయుదునే ఒకసారివాని కన్నెనీవన్నిటనునేర్పరి
ఔత్సుక్యం, విషాదం, నిర్వేదం ముదము, దైన్యం, ధృతి
లెన్ననీకునసాధ్యమేమున్నదే యామన్నెదొరతో విన్నపముజేసి
వితర్కం, శ్రమ, శంక, దైన్యం నిర్వేదం, దైన్యం, ముదము
యీరాత్రి ॥బోటిరో॥
ఔత్సుక్యం, దైన్యం

2\. ఎమ్మెకాడువచ్చుననినిదురలేక యెదురుజూచివేసారితియిందాక
దైన్యం, ధృతి, స్మృతి, విబోధం ముదము, ధృతి, శ్రమ, దైన్యం
అమ్మజెల్లాచలువవెన్నెలకాకలాయె
దైన్యం, విషాదం, అగ్ని, ఆవేగం
నింకనిముషమైననోర్వజాలనే
ఆలస్యం, ఔత్సుక్యం, విషాదం, ధృతి
జాలంబులేలనే యికతాళలేనే సమ్మదమునగూర్పనిదిభారమా
ఆలస్యం, వితర్కం, మోహం, ఆర్తి, ముదము, దైన్యం, శ్రమ, వితర్కం
యీతుమ్మెదలనాదము మరిమరివినగనాతరమా వకసారికేని
ఔత్సుక్యం నిర్వేదం, గ్లాని, వితర్కం దైన్యం
తెమ్మెరలరథముగా విరులుశరమ్ములును శుకసంతతులును
నిర్వేదం ఔత్సుక్యం అసూయ

సైన్యములైననుగెల్వనాపై కమ్మవిలుతుడుదాడివెడలెను ॥బో॥
త్రాసము, విషాదం అసూయ, ఆవేగము, ధృతి, విషాదం, చింత, త్రాసం

3. మదిరాక్షిరోబంగారేచేంద్రుడుడాసి దానిమాటలునిజముజేసి
దైన్యం, ఔత్సుక్యం, చింత అసూయ, ధృతి, విషాదం
అవభావమునన్నెడబాసి నదిమొదలుకొనిభుజియించ
ఔత్సుక్యం, చింత దైన్యం, అసూయ
దోచదాయెనె మరులదనమాయెనే యికతాళలేనే
స్మృతి, నిర్వేదం మోహం, గ్లాని ఆలస్యం, శ్రమ, విషాదం
సుదతిరోనామనవిచేకొనవే యిక్కనైనవేడుకలొదవగా
దైన్యం, ముదము ఆవేగం, ముదము, దైన్యం
నన్నేలుకొమ్మనవే వొకసారివాని పెదవితేనెయానిపైకొని
ఔత్సుక్యం, దైన్యం దైన్యం, అలస్యం, ఔత్సుక్యం, ఆవేగం
కొదుమచనుగవగదియనెదనెద నదిమిమదనకదనమున
ఔత్సుక్యం, దైన్యం మోహం, దైన్యం
నుపరతి గదియకను మదినితమినిలువదు ॥బోటిరో॥
రతులు, విషాదం, చింత మోహం, ధృతి, విషాదం, చింత, నిర్వేదం

68. ముఖారిరాగం, చాపుతాళము.

---

నాయికలక్షిత, సఖీభావము, పార్శ్వచారిణి, ఈర్ష్యామానవిప్రలంభశృంగారము; కరుణారసము.

ఔత్సుక్యము, అవహిత్థ, వితర్కము, శంక, ఆవేగము, శ్రమ, ముదము, స్మృతి, మోహం, దైన్యము.

పల్లవి. చూడుడీజోడద్దములపైని సన్నంపుచుక్కలుగనుపించెనే
ఔత్సుక్యం అవహిత్థ, శంక, వితర్కం, ఆవేగము



అనుప. వేడుకమదనసంగరమున నలసినజాడవలెనున్నది జవ్వనివేడ్క
రతులు, ముదము, శ్రమ, స్మృతి, ధృతి, ముదము, వితర్కం, అవహిత్థ, శంక

1. జక్కనసిట్టల చందమామకూన
ఔత్సుక్యం
లెక్కనవగజూచితే చొక్కంపుబంగారు
ముదము ముదము
కుండలపై కెంపు చెక్కినట్లుగనున్నదే జవ్వనివేడ్క ॥చూ॥
ఔత్సుక్యం, అవహిత్థ, ధృతి, శంక, వితర్కం, దైన్యం

2. మిక్కిలిచీకటిని చిక్కబడినచందమామను గ్రమ్ముటజూచితే
ఔత్సుక్యం, శ్రమ, ముదము, వితర్కం, శంక, అవహిత్థ
మక్కువతమ్మిపై ముసరినగండు
ముదము ఆవేగం
తుమ్మెదగుంపువలెనున్నదే జవ్వనివేడ్క ॥చూ॥
అవహిత్థ, వితర్కం, శంక దైన్యం

3. మట్టపల్లిసామి పగడంపుపై కెంపు చెట్టునవగజూచితే
ఔత్సుక్యం అవహిత్థ, శంక, వితర్కం
గుట్టుగయీరేయి మదనభండారము కొల్లలైనట్లున్నదే
అవహిత్థ ఔత్సుక్యం శంక, వితర్కం
జవ్వనివేడ్క ॥చూడుడీ॥
మోహం, దైన్యం

69. బేగడరాగం, చాపుతాళము.

---

నాయికపరకీయ, ప్రౌఢ, సురతప్రియ, నాయకుడు, ఉపపతి, విరహావిప్రలంభశృంగారము, శృంగారరసము.

ఔత్సుక్యము, ఆవేగము, దైన్యము, మోహము, ఉగ్రత, శంక, వితర్కము, విషాదము, అమర్షము, స్మృతి, ధృతి, మతి.

పల్లవి. చెరగుమాసియున్నానని మోచనసేయవద్దురసామి॥
అమర్షం, ఔత్సుక్యం, శంక, వితర్కం, దైన్యం, మోహం, ఆవేగం, ఉగ్రత

అనుప. ధోరయానామువ్వ గోపాలపరసతులకు దోసమెన్నడులేదురా
దైన్యం, ఔత్సుక్యం, దైన్యం ఉగ్రత, స్మృతి, ధృతి,

1. సరసకురమ్మని చాలానేవేడితే శంకపడేవేమిరా
ఔత్సుక్యం దైన్యం శంక, వితర్కం, విషాదం, ఆవేగం
అరసీకులతప్ప శాస్త్రములునిజ మనుచునమ్మవద్దురా
దైన్యం విషాదం మతి, ఉగ్రత
దురుసుగనేనీ వద్దికివచ్చితే దూరమరిగేవేమిరా
విషాదం దైన్యం శంక, అమర్షం, వితర్కం, విషాదం
వలపుమీరఆ వారనుండినన్నంటక మొకముద్దైనయివ్వరా
మోహం దైన్యం ఔత్సుక్యం, విషాదం, దైన్యం
నన్నంటకనాసామి ॥చెరగుమాసి॥
దైన్యం

2. సదయానాపైయ్యెడ తొలగించినీయద చనుమొనలనుగృమ్మెద
ఔత్సుక్యం విషాదం మతి, ధృతి
వదిగిమేనంటక నీదుతియ్యనిమోవి యొనరగనానెదను
ఔత్సుక్యం విషాదం, మోహం, మతి, ధృతి
మదనజనకఅందుండినీమొనపంట మడుపులందీయుదునా
ఔత్సుక్యం మతి, వితర్కం, శంక, దైన్యం
యేవగనైనా ముందువెనుకజూతురా నాసామి ॥చెరగు॥
ఔత్సుక్యం, శంక, వితర్కం, దైన్యం



3. తన్నుతానెరుగక దొలగుటయీనట్టి తప్పునీమములేలరా
స్మృతి, ఉగ్రత, అమర్షం, ఉగ్రత, మతి, శంక, వితర్కం
పెన్నెలాడులకిది సహజగుణంబని వార్తయువినవేమిరా
దైన్యం స్మృతి, ధృతి, మతి, దైన్యం, శంక, వితర్కం
నిన్నమొన్నయోమువ్వగోపాల నీవింకయిదివినరా
ఔత్సుక్యం దైన్యం, విషాదం
ఇన్నాళ్ళవలెగాదురా నేటిసుఖమెరిగిత్తె
స్మృతి, విషాదం మోహం, మతి
మరువవురా నాసామి
ఉగ్రత, ధృతి దైన్యం

## 70. భైరవిరాగం, చాపుతాళము.

---

నాయికపరకీయ, నవోఢ, నాయకుడు, దక్షిణుడు, ప్రోత్సాహదూతి. సఖి, పార్శ్వచారిణి, భయానకరసము, భయస్థాయి, ఆలస్యము, ధృతి, హర్షము, గర్వము, త్రాసము, చింత, అవహిత్థ, దైన్యము, శంక, వితర్కం.

పల్లవి. జాడగజూచిన నాటికేగాదా దండించబోయ్యేరుమీవారలు
ఆలస్యము, హర్షం, ధృతి గర్వము, త్రాసము, దైన్యం

అనుప. ఆడదానిమన సేమనిదెలిసేరు
అవహిత్థ శంక, వితర్కం, దైన్యం
అటివరోవచ్చి పువ్వులువేసుకోవే
హర్షం దైన్యం

1. జంటగత్తెనావంటిదిసికుండగ ఇంటివారునిన్నేమిజేసెదరు
గర్వం, ధృతి త్రాసము, చింత

ఒంటిపాటునవాడంటవచ్చినవేళకంటే సుంకముకనకుంటేబింకము
హర్షం, అవహిత్థ, అలస్యం త్రాసము, ధృతి, విషాదం

2. లంకాద్వీపమువంటి సంకేతస్థలమమరే
హర్షం, ధృతి గర్వం

బింకముజేసేవు బోటిరోనీవు
త్రాసము, శంక, దైన్యం

ఇంకాదిటవులేక యెందుకువెరచేవు
చింత, అవహిత్థ, శంక, వితర్కము, త్రాసము

రంకాడనేర్చినది బొంకాడనేరదే
గర్వం, అవహిత్థ, శంక

3. మగనికన్నదొంగ మగనిపొందేమేలు
ధృతి హర్షం, ధృతి

వగకాడుమువ్వగోపాలుడుతాను
దైన్యం, హర్షం

తగినవారిమనసు తనివిదీర్చేవాడు
హర్షం, మోహం, ధృతి

మగువరోయూరకదిగులొందనేల ॥జా॥
దైన్యం, త్రాసం, శంక, దైన్యం, చింత, వితర్కం

N. B. నవోఢ అనగా : 1 లజ్జాభయ పరాధీనయగునది : అనగా, శిగ్గుయందు భయమందు మిక్కిలి అధీనమైన కీర్తి డగలది.

2. లజ్జచేతను భయముచేతను పరాధీనమైన సురతముగలది నవోఢ యనబడును.



71. సావేరరాగము, త్రిపుటతాళము.

---

నాయికపరకీయ, సాహసిక ప్రౌఢ, అయోగవిప్రలంభశృంగారము, కరుణారసము.

దైన్యము, అమర్షము, నిర్వేదము, ఔత్సుక్యము, ధృతి, విషాదము, అసూయ, మతి, చింత, మోహము, ఉగ్రత, శంక, వితర్కము.

పల్లవి. తరుణిరోనన్నాడదాని జేసినవిధికి తగలకపోదేనాయనురు
దైన్యం, అమర్షం నిర్వేదం ఉగ్రత, ధృతి, విషాదం

అనుప. మరుకేళిలోపల మనసివ్వనేరని
ఔత్సుక్యం నిర్వేదం, మోహం

మగనితోననుగూర్చెనే మాయజేసెనే ॥తరుణీ॥
అసూయ, అమర్షం, ధృతి చింత, విషాదం

1. మగువాపాపపుబ్రహ్మ మగవాడుగావున మనసుతెలియదాయనే
దైన్యం, అసూయ, అమర్షం, ధృతి నిర్వేదం, చింత, దైన్యం

అగణితముగనేమగవాడనైతే వానిబిగువెట్టిదోచుతునే
ఉగ్రత, ఔత్సుక్యం, మతి, ధృతి, ఉగ్రత, నిర్వేదం, ధృతి, మోహం

మేమిసేతునే ॥తరుణీ॥
విషాదం, చింత, దైన్యం

2. అమ్మలక్కలుగూడి ఆడుకోనేటికే అతివరోనేగోలనా
దైన్యం విషాదం, చింత నిర్వేదం, శంక, వితర్కం

యిమ్మగముమ్మాటికి ననిసమువ్వగోపాలుని నమ్మి తెగించెదనే
మతి, హర్షం ఔత్సుక్యం ఉగ్రత, ధృతి

ఇలుదాటెదనే ॥తరుణీరో॥
చింత, విషాదం

## 72. తోడిరాగము, రూపకతాళము.

నాయికస్వీయ, ఉత్తమ, నాయకుడు, ధృష్టుడు, సఖిశిక్షాస్వభావముగలపార్శ్వచారిణి, కరుణారసము, సంభోగశృంగారము, దైన్యము, వితర్కము, ఔత్సుక్యము, హర్షము, శంక, స్మృతి, మోహం, రతివిశేషములు, ఆవేగము, ఆలస్యము.

పల్లవి. తగదుపోపొమ్మన నాతరమాఓయమ్మా ॥తగదుపోపొమ్మన॥
దైన్యం, వితర్కం    శంక, దైన్యం

అనుప. మగువరో రాజగోపాలదేవుని ॥తగదుపోపొమ్మన॥
ఔత్సుక్యం, దైన్యం

1. వడిగవాడిందువచ్చి వద్దజేరిముద్దుబెట్టి
ఆవేగం    మోహం, హర్షం
తడవేలవిడెమిమ్మని తానారెకుననువేడిన ॥తగదు॥
ఆలస్యం, ఔత్సుక్యం    దైన్యం, వితర్కం

2. సరసములాడుచునాడు చక్కనిచెక్కులునిమురుచు.
ఔత్సుక్యం, స్మృతి    ఔత్సుక్యం, హర్షం
గుబుకుచములగోరులుంచి కొమ్మానీపుణ్యమనిన ॥తగదు॥
మోహం, హర్షం    దైన్యం, శంక, వితర్కం

3. మనసిజకేళినిగూడి నమువ్వగోపాలసామి
రతివిశేషములు, హర్షం    దైన్యం
గలసినచందాన ముదితనన్నేలుమనిన
స్మృతి, హర్షం    ఔత్సుక్యం, శంక, వితర్కం

## 73. భైరవిరాగం, చాపుతాళము.

నాయికపరకీయ, ప్రౌఢ, అనుశయాన, నాయకుడుఅనుకూలుడు, కరుణారసము.



దైన్యము, చింత, మోహము, వితర్కము, ఔత్సుక్యము, ధృతి, ఉగ్రత, విషాదము అవహిత్థ, గ్లాని, ముదము, త్రాసము, స్మృతి.

పల్లవి. బొట్టుగట్టినవానింటికి పోయివచ్చెదసామి బొట్టుగట్టి
దైన్యం    చింత, దైన్యం

అనుప. పుట్టినింటనేయుండుట సతులకుపొసగునా వేణుగోపాల॥
ముదము, దైన్యం    చింత, వితర్కం    దైన్యం

1. చెలియలిపెండ్లికి తిరుగవచ్చెద నెలదినములలోనేను
దైన్యం,    ధృతి    ఔత్సుక్యం, ధృతి
చెలిమియంతలోమరువకయుండుమీ చెలువుడనీమదిలోను
దైన్యం, ధృతి, చింత    ఔత్సుక్యం
కలుగజేసెనీనడవడి దైవము కులభామలకెల్లను
గ్లాని, ఉగ్రత, బ్రహ్మనింద    చింత, విషాదం, అవహిత్థ, ధృతి
నిలువరముగనీదయయిందుండితే నీసొమ్మేగాదా
దైన్యం, వితర్కం    ధృతి, దైన్యం, వితర్కం
యీమేను ॥బొట్టుగట్టినవానింటికి
ముదము, దైన్యం

2. తిరునాళ్ళనుచు నీవైనాయొకపరి యందాకారారాదా
అవహిత్థ, దైన్యం    ఔత్సుక్యం, వితర్కం, దైన్యం
గురుతుజూచుచుండుదు నీవేలివుంగరమైనాయీరా
స్మృతి, ముదము    ఔత్సుక్యం, వితర్కం, దైన్యం
విరహమోర్వలేనంటిచిపరా ఇరువురకుసరిపోరా
మోహం విషాదం వితర్కం,    ఉగ్రత, చింత

మరిమరిసెలవిమ్మనియడిగితేనా మాటలుచెవినిబట్టవు

ఔత్సుక్యం, దైన్యం　　　దైన్యం విషాదం ధృతి ఉగ్రత

ఓరినాసామి॥

దైన్యం

3\. కోరికలొకసారితీరెగదాయిక గొబ్బునసెలవియ్యరాదా

మోహం, ధృతి, మదము　　　దైన్యం వితర్కం

శౌరివేఃమగోపాలతిరుగా చలపోరుటమరియాఁదా

దైన్యం ధృతి　　　ఉగ్రత, గ్లాని, వితర్కం, దైన్యం

వారువీరుమనజాడలుజూచితె ఏరా మోసముగాదా

అవహిత్థ, ఉగ్రత,　　　వితర్కం, త్రాసము

ఓరదింకనేనేమిసేయుదు దేవుడలిగెను మనమీద ॥బొట్టుగట్టిన॥

గ్లాని, వితర్కం, మోహం　విషాదం, చింత, ధృతి

74\. ఆఠాణారాగం త్రిపుటతాళము.

---

నాయిక, సామాన్య, అన్యసంభోగదుఃఖిత, కనిష్ట, నాయకుడు శఠుడు, ఈర్ష్యామానవిప్రలంభశృంగారము, అద్భుతరసము, రౌద్రరసము, అసూయ, అమర్షము, వితర్కము, వ్రీడ, దైన్యము, శంక, హర్షము, మోహము, చింత, జడత, గ్లాని, మూర్ఛ, పశ్చాత్తాపము, ధృతి.

పల్లవి. మదవతిబెట్టిన మందులోనతగిలి సదయుఁడునన్నింత

అసూయ, అమర్షం, వితర్కం. ధృతి,　దైన్యం, వితర్కం

చౌకజేసెనట ॥మదవతి॥

దైన్యం, వితర్కం శంక

అనుప. ఇదియేటిసద్ది గోపాలునకు యెవరుజెప్పినబుద్ధి ॥మదవతి॥

వితర్కం, అమర్షం, దైన్యం,　అసూయ, దైన్యం వితర్కం, శంక దైన్యం



1\. నన్నువంచనజేసి నన్నుతాఁగిపైని కన్నువేసినాడట

దైన్యం　　　అసూయ　　　హర్షం, వితర్కం

దానితోటిచిన్నెలుజేసినాడట అలదానిగూడి

అసూయ, మోహం, వితర్కం, ధృతి, అసూయ

చిన్నిచనులపైని కొర్రిన్నెలవంకలు మిన్నగసవరించి

వ్రీడ　　　అసూయ　　　హర్షం

మెచ్చుకొన్నాడట ॥మదవతిబెట్టినమందు॥

అసూయ, హర్షం, దైన్యం చింత, వితర్కం

2\. వలచిఅలదాని వలలోజిక్కుకొని చెలియకుదక్కెనట

మోహం, అసూయ, ధృతి, మోహం, అసూయ, అమర్షం, శంక, వితర్కం

దానిమాయలకుసొక్కినాడట దానినొసలతిలకముకొన

అసూయ, చింత, మూర్ఛ, గ్లాని　అసూయ, చింత

గోరదిద్దిచెక్కిలినొక్కి మొలకనవ్వులమోముతోముద్దులాడెనట

హర్షం వ్రీడ　　　హర్షం　　　మోహం, ధృతి, వితర్కం, శంక

3\. ఎలమిశ్రీశైలనిలయుడు సఖుడగుచు వెలసినమువ్వగో

దైన్యం　　　హర్షం　　　చింత

పాలుడుయింతటివాఁడౌట తెలియనైతినెప్పుడు

జడత, వితర్కం, శంక, పశ్చాత్తాపం, విషాదం

నన్నురతులవలచియున్నదిమొదలు విలపించినారాఆ

రతులు, మోహం, ధృతి　　　గ్లాని, వితర్కం, శంక

వెలదికింటికేవేళ వెళ్ళుచున్నాడట బొట్టుగట్టిన ॥మదమతి॥

అసూయ, దైన్యం,　చింత, ధృతి, శంక, చింత, వితర్కం

75\. తోడిరాగము రూపకతాళము.

---

నాయిక పరకీయ, ప్రౌఢ, అనుశయాన, నాయకుడు శఠుడు, శృంగారరసము.

దైన్యము, అవహిత్థ, విషాదము, మోహము, హర్షము, మాయలు

పల్లవి. ముద్దుబెట్టిపోయినాడే మోహనాంగిరో నాకొక ॥ముద్దు॥
దైన్యం విషాదం, హర్షం

అనుప. సద్దుసేయవద్దనుచు సైగజేయుచు నాకొక ॥ముద్దుబెట్టి॥
అవహిత్థ దైన్యం హర్షం

1. టక్కులొల్కవాడునాడు పక్కలోజేరి వలపెక్కగగోర
మాయలు హర్షం మోహం
చెక్కులోన చెక్కుజేర్చి మొక్కివేడుచు నాకొక ॥ముద్దు॥
హర్షం, దైన్యం దైన్యం విషాదం దైన్యం.

2. కప్పురంపువిడెమిచ్చి కొప్పునుబట్టి తలత్రిప్పగతట్టి
హర్షం హర్షం విషాదం
సర్పవేణియవరితోడ చెప్పవద్దని నాకొక ॥ముద్దు॥
దైన్యం, అవహిత్థ, దైన్యం విషాదము

## 76. ఆనందభైరవిరాగం త్రిపుటతాళము.

---

నాయికపరకీయ, ప్రౌఢ, నాయకుడు ఉపపతి, అయోగవిప్రలంభ శృంగారము, భయానకరసము, భయానకరసము, పదమంతటా యున్నది.

దైన్యము, త్రాసము, మోహము, విషాదము, శంక, చింత, హర్షము, స్మృతి, ప్రబోధ, ఆలస్యము, వితర్కము, అమర్షము, గ్లాని, శ్రమ, ఔత్సుక్యము, చక్షుప్రీతి, ఉగ్రత, అసూయ, ధృతి, రోషం.

పల్లవి. రేపువత్తువుగాని పోరా నేటికితాళి ॥రేపువత్తువుగాని॥
అయోగవిప్రలంభం, దైన్యం, త్రాసము, దైన్యం దైన్యం, హర్షం

అనుప. ప్రాపుగోరితిరానా సామిమువ్వగోపాల ॥రేపువత్తువుగాని॥
దైన్యం మోహం విషాదం, దైన్యం



1. రాత్రిపగలొక్కటిగను నన్నురమ్మంటే
మోహం, త్రాసము, విషాదం, వితర్కం
మాయింటివారు మాతులుత్రిప్పేరు
దైన్యం, త్రాసము, అసూయ
మొన్నవచ్చితివని వాడేలతడవాయె
స్మృతి, హర్షం, వితర్కం, ఆలస్యం, అమర్షం
వద్దునేటికితాళి ॥రేపువత్తువని॥
అమర్షం, ఉగ్రత, దైన్యం

2. మనునాడేననుగూడితివి మరుకేళిగలసిమెచ్చితివి
స్మృతి, ఔత్సుక్యం, ధృతి, హర్షం, మోహం, ధృతి
మరియాదగలిగిన దొరబిడ్డనీవైతే తెరచిచూడరా
హర్షం, ధృతి, వితర్కం శంక, త్రాసము, దైన్యం.
తలుపు తూర్పుతెల్లవారెర ॥రేపువత్తువుగాని॥
శంక, వితర్కం, ప్రబోధ, దైన్యం

3. రాపుసేయకునాతోపోరా నన్నేరతినేలిన
ఆలస్యము, అమర్షం, వితర్కం, హర్షం, ధృతి
మువ్వగోపాల కోపగించిపోయ్యేవు
దైన్యం రోషం, వితర్కం, దైన్యం
కొన్నినాళ్లాయెనీవు తాపమణచవేరా
ఆలస్యం, వితర్కం, శంక, ధృతి, గ్లాని, శ్రమ, వితర్కం, శంక
ఆలస్యం, ఔత్సుక్యం, దైన్యం
దయతోగలసిపోరా ॥రేపువత్తువుగాని॥
ఔత్సుక్యం, మోహం, విషాదం, దైన్యం

77. కేదారరాగం, రూపకతాళము.

నాయికసామాన్య ప్రౌఢ, మధ్యమ, వక్రోక్తిగర్వితా, శృంగారము, అద్భుతరసము.

గర్వము, వితర్కము, ధృతి, విషాదము, అసూయ, సుప్తి, ఔత్సుక్యము, దైన్యము, హర్షము, నిర్వేదం, శంక.

పల్లవి॥ రమ్మనవేసముఖాన రాయభారమేలే॥ రమ్మనవే॥
ఔత్సుక్యం, గర్వం వితర్కం, దైన్యం

అనుప. కమ్మవిల్తునిగన్న చక్కనిమువ్వగోపాలుని ॥రమ్మనవే॥
హర్షం, ఔత్సుక్యం, విషాదం

1. సొగసుజేసుకవచ్చి సుదతులందరుజూడ
గర్వం, దైన్యం హర్షం, వితర్కం
వగలుజేసితల వాకిటనిలచి తెగనాడేవిధమేమో
హర్షం, ఔత్సుక్యం, దైన్యం, వితర్కం, శంక, ధృతి
దినదినముకొత్తలాయె ఇగురుబోణిరోవచ్చి
అద్భుతం, ఔత్సుక్యం విషాదం, దైన్యం
యెంతసేపాయునో ॥రమ్మనవేసముఖాన॥
ఆలస్యం, వితర్కం, నిర్వేదం, దైన్యం
విషాదం, దైన్యం

2. యిరవందనిన్నమా యింటివరకువచ్చి
ఔత్సుక్యం విషాదం, నిర్వేదం
తిరుగవేంచేసేసట సరిపొద్దువేళ
వితర్కం, విషాదం, హర్షం, నిర్వేదం
విరిబోణులెవ్వరో వేళగాదనిరట
అసూయ, శంక, వితర్కం, సుప్తి, వితర్కం, విషాదం



తరుణీరోమేమంత ధోరలమా మాబాగాయె ॥రమ్మనవే॥
విషాదం, నిర్వేదం, వితర్కం, గర్వం, దైన్యం, విషాదం, వితర్కం

3. రామరో తానొక్కడు రాలేదోపోలేదో
విషాదం, నిర్వేదం, దైన్యం వితర్కం, శంక
కాముకేళినినన్ను కలయలేదో
రతులు, విషాదం వితర్కం, ధృతి, హర్షం
ఏమేసందాక ఎదురుగారావలెనో
విషాదం గర్వము, వితర్కం, దైన్యం
మామువ్వగోపాలుడు మనసుశోధించెనేమో ॥రమ్మ॥
ఔత్సుక్యం విషాదం, నిర్వేదం, వితర్కం, శంక

78. మొదుకుల కాంభోజిరాగం, ఆటతాళము.

నాయిక స్వీయ, అజ్ఞాతయావన, నాయకుడు, అనుకూలుడు, సంభోగశృంగారము, అద్భుతరసము.

హర్షము, శంక, దైన్యము, త్రాసము, వ్రీడ, ఉగ్రత, వితర్కము, ధృతి, అవహిత్థ, మోహము, వితర్కము, అసూయ, అమర్షము.

పల్లవి. సుదతులందరునీకు శోభనమనియంటే అదియేమొఅనుకొంటినే॥
హర్షం, దైన్యం శంక, ధృతి శంక, వితర్కం, దైన్యం,

అనుప. సదయుడుశయ్యపై చక్కగబవ్వళింప పదపదమనివాని
దైన్యం, హర్షం, దైన్యం, వ్రీడ, ఉగ్రత
పక్కకుబంపిరి ॥సుదతులందరు॥
త్రాసము దైన్యం,

1. చెలియరోశయ్యపై నిలువసిగ్గైనేను యూరకేనిలుచుంటినే

దైన్యం వ్రీడ దైన్యం అవహిత్థ, ధృతి

చెలువుడుపిలచిన బలుకతలవంచి పలుకకూరకుంటినే

హర్షం, దైన్యం, వ్రీడ అవహిత్థ, దైన్యం,

కలకంఠిముంజెయ్యి కలియబట్టితన తొడలపై జేర్చి

హర్షం, ఉగ్రత, ధృతి, ధృతి

చక్కిలిగింతబెట్టెనే ॥సుదతులందరు॥

వ్రీడ త్రాసము, శంక

2. ముద్దులగుమ్మనీమోమెత్తి వకసారి

హర్షం వ్రీడ

ముద్దివ్వమనివేడెనే సద్దుసేయకమన మిద్దరిలోపల

శంక, మోహం, దైన్యం దైన్యం, హర్షం,

సిగ్గెందుకనిబల్కెనే వద్దికగలమంచి బిగిగలనామనసు

వ్రీడ శంక వితర్కము హర్షం ఉగ్రత, ధృతి,

తద్దయునరగించి తాకౌగలించెనే ॥సుదతులందరు॥

అవహిత్థ, హర్షం త్రాసము, దైన్యం

3. తెల్లనాకుమడుపులుపంటనొక్కి యెంగిలిజేసియందిచ్చెనే

హర్షం, ఉగ్రత అవహిత్థ, అసూయ, శంక

పలుమారుపెదవి యెంగిలిజేసి యూపైనపలువరుసనాటించెనే

ఉగ్రత, హర్షం మోహం, అసూయ, శంక

నెలకూనవంటినానెన్నుదురుటద్దములపైచెక్కిళ్లుముద్దాడిగరచెనే

వ్రీడ హర్షం, దైన్యం ఉగ్రత త్రాసము, దైన్యం

4. పయ్యెదదొలగించి పట్టురవికముడి సయ్యానసడలించెనే

హర్షం, అవహిత్థ, వ్రీడ, శంక



కుయ్యాలింపకచిన్ని కుచములపైగంధ మయ్యయోయనబూసెనే

ఉగ్రత ధృతి మోహం, త్రాసము, శంక, విషాదం

తియ్యనిమాటల తేనెలుజారగ వయ్యారముగ

హర్షం, హర్షం గర్వము,

నెల వంకలునొంచెనే ॥సుదతులందరు॥

వ్రీడ శంక, దైన్యం,

5. పడతిరో నేజేయు పనులుతోచక తడబడుచునూరకుండగా

దైన్యం శంక, జడత విస్మయము, ధృతి

నడుమునిమిరిపోక ముడివదలించిన యొడలిపైకళలంటుచు

త్రాసము, వ్రీడ అవహిత్థ, హర్షం,

తొడలెడలించి చన్దోయిబట్టియా పడుచుతనపు

వ్రీడ ధృతి ఉగ్రత అమర్షం, ఉగ్రత అమర్షం

కొంకెపనులేమోజేసెనే ॥సుదతులందరు॥

అసూయ శంక వితర్కం విషాదం నవ్వ త్రాసము దైన్యం,

6. పల్లవపదశాన పల్లెలోనాడల్లా గిరిజామనోహరుని

హర్షం స్మృతి హర్షం దైన్యం

తెల్లమాకీర్తిశోభిల్లగ నిల్పినఅల్లరామకృష్ణుని

దైన్యం హర్షం ధృతి, స్మృతి, దైన్యం

చల్లనిదయచేత నెల్లవేళనుబ్రోచే అల్లశంకరుడునా

హర్షం, దైన్యం ధృతి స్మృతి, దైన్యం

యుల్లముగరగించెనే ॥సుదతులందరునీకు॥

మోహం, ధృతిన, దైన్యం

### 79. సావేరిరాగం, త్రిపుటతాళము.

నాయికస్వీయ, అంకురితయావనయగుముగ్ధ సఖిపార్శ్వచారిణి అద్భుతరసము సంచారీలు హర్షము, ధృతి, మోహం.

పల్లవి. సరసిజాననగుబ్బ చనులతీరుజూడ
సరవితో చక్రవర్తులునుండెను.

హర్షము, మోహం, ధృతి

1. సొలపుమీర కనుబొమలు మోమునవ్వు అలనూగారుచూడ
అంగానుకు అలరుచు ధర్మరాజార్జునకృష్ణసం
కలితమహాభారతకధవలెనుండెను.

2. రమణీయమగుఅధరముకురులూరూలు గమనరేఖలు
జూడ కామినికిరమణపాటలనీల రంభగజాదులనమరి
శ్రీరాముసైన్యమువలెనుండెను.

3. మొరపుమేనునేత్రయుగముమాటలుజూడ ధరణిలో
శ్రీవెంకటధన్యురాణికినిబురుణింప గాంగేయపుండరీక
శుకాదుల కరణిశ్రీభాగవతకధవలెనుండెను.
హర్షము, ధృతి, మోహం, పదమంతటాయున్నది.
యీపదముతాత్పర్యమేమనగా:—

చెలికత్తెయలచే సూచించబడ్డ అవయవసౌష్టవలక్షణములుగల దిగాన ఇదిఅంకురిత యవ్వనయగు ముగ్ధయనబడును.

గుండ్రనైన చన్నులయొక్క అందముచూడగా:—

చక్రవర్తులవలె హరిశ్చంద్రాదులయ్ని రాజులవలెనున్నది.

అనగా చక్రవర్తియనిచెప్పినపుడు భూచక్రము గుండ్రనగనుక అటువలె చన్నులుగుండ్రముగానున్నవి.

1 ధర్మరాజు=ధర్మరాజు
అర్జున=అర్జునుడు
కృష్ణ=ద్రౌపది

} వీరితోటి సంకలితమహా=ఒప్పచుండే భారతకధవలె=భారతమందైన కధవలెవుండెను.

రెండవఅర్థమందు.

ధర్మ=విండ్లు రాజు=చంద్రుడు; అర్జున=తెలుపు; కృష్ణ=నలుపు; ధనస్సువంటి= కనుబొమ్మలున్న; చంద్రునివంటి=ముఖమున్న తెల్లని= నవ్వున్న; నల్లని=నూగారున్న; గలది.

2 పాటల=పాటలుడు
నీల=నీలుడు
రంభ=రంభుడు
గజ=గజుడు

} గూడినశ్రీరాములవారి సైన్యమువలె నున్నది.

రెండవఅర్థము

పాటల=యెరుపుఅనగా యెర్రనిది అధరోష్టము.

నీల=నలుపుఅనగా నల్లనివి కురులు.

రంభ=అరటిస్థంభములనగా అరటిస్థంభములవంటితొడలు.

గజ=యేనుగుఅనగా యేనుగునడకలవంటి నడకలుగలది.

3. గాంగేయ=తాటిచెట్టు; తాటిచెట్టుధ్వజముగా గలవాడు గంగా కుమారుడు భీష్మలవారు.

పుండరీక=తపోధనుడైన పుండరీకమహాముని.

శుకుడు=పరమతాపసుడైనశ్రీశుకులు.

వీరివలెనే

శ్రీభాగవతమందైన కధవలెనున్నది అనగా

రెండవఅర్థము.

గాంగేయ=బంగారమువంటి శరీరమున్న.

పుండరీక=పద్మము తామరరేకులవంటినేత్రములున్న.

శుక=చిలుక చిలుకవంటి పలుకులున్న గలది.

## ౮౦. సురటరాగం, ఆదితాళము.

నాయికస్వీయ, విరహోత్కంఠిత, నాయకుడు, శఠుడు, ప్రోత్సాహదూతి, విరహవిప్రలంభశృంగారము, కరుణారసము, దైన్యము, అమర్షము, గ్లాని, చింత, విషాదము, ఆలస్యము, ఆర్తి, త్రాసము, ధృతి, ఔత్సుక్యము, హర్షము, రతులు, ఆవేగం.

పల్లవి. తావకీనకోపాతిశయేన తపతిసపదిసావిరహభరేణ
దైన్యం, అమర్షం   గ్లాని, చింత, విషాదం, ఆర్తి, ఆలస్యం
శ్రీవెలుగోటికులాంబుధిచంద్ర శ్రితజనహితబంగారేచేంద్ర
ఔత్సుక్యం   హర్షం, దైన్యం
దావకీలి కీలాపరుషేణ త్వరితగమననిర్జితపవనేన
ఆర్తి, ఆవేగం, గ్లాని, విషాదం
భావజచాపవిగళితేన సుమబాణనికరేణ
ఆర్తి, చింత   త్రాసము, చింత, విషాదం
బహుదీనతాం ॥తావకీన॥
దైన్యం

అనుప. తాంప్రథితగుణహితాం తవహితమేవాత్మనిసదా
దైన్యం, దైన్యం, ధృతి, దైన్యం, ధృతి
భిలషితాం తావకమతివిహితాం రమయసుచరితాం
దైన్యం, ధృతి, ఔత్సుక్యం
కురునితాంతమతికరుణాం తదుపరిధనేశతతవితరణ
దైన్యం
ధినుతజనపతికవిపూజిత గుణమణిని శాంతభరితశాంత
సకలవిబుధజన హృదయ కువలయవిధో ॥తావకీన॥,
దైన్యం



(యీచరణమంతా దైన్యముపట్టవలెను)

1. వారయసుదతిఖేదం పరిపూరయతస్యామోదం
చింత దైన్యం   దైన్యం హర్షం
దూపకురుసంవాదం నహి సారచయత్యపరాధం
దైన్యం,   దైన్యం
కారుణ్యేనవిలోకనిత్యం కామయతేహ్యాదితవసాంగత్యం
దైన్యం,   ధృతి ఔత్సుక్యం
వారిజాస్త్రసమసుందరవిగ్రహ వసతినిహితమోహావశాదపి
ఔత్సుక్యం,   మోహం,
గృహే శారికయానవదతి తస్యామిహాశాంత
ఔత్సుక్యం, విషాదం చింత, దైన్యం
రసమంతరంగణేవహ ॥తావకీన॥
దైన్యం

2. దీనావనజనపోషణ కవిధీరశ్రవణవిభూషణ
హర్షం, దైన్యం   దైన్యం, హర్షం
మానితబహురసపోషణం శ్రోతుంమనశ్చేచ్ఛతి
దైన్యం   ధృతి, హర్షం
తవభాషణం మానయతామనురాగభరేణం
ఔత్సుక్యం, హర్షం
మందిరమాసయసుఖమచిరేణ దానకర్ణతరుణీముపలాలయ
దైన్యం, ఆలస్యం, ఔత్సుక్యం,   దైన్యం, ఔత్సుక్యం
తవహిసదృశరూపామనుభావయ సానలిమకపోత్త్వమ
ఔత్సుక్యం,   దైన్యం

నధారయ సారకరుణారసాశ్రియసా ॥తావకీన॥

దైన్యం, విషాదం, చింత

3\. సంగీతకళాశారదసా సకలలక్షణవిశారదా అంగీకురు

ధృతి ధృతి

తాంత్వమ్ముదా మదనసంగరేషు తల్పేసదా శృంగారవతీ

దైన్యం, హర్షం, రతులు

మానయేతిసఖిహే త్వంవదమాంప్రతిసంప్రతి బంగరేచనృపతే

ఔత్సుక్యం

శృణుమామకభాషణమతిహిత మపనీనాయక సంగమమభివాంఛ

ఔత్సుక్యం, దైన్యం.

య సుఖదాయక అంగనాపాంగసుమసాయక॥ తావకీన॥

దైన్యం

యీపదమునకు అర్థము.

తావకీన=నీసంబంధమైన కోపాతిశయేన కోప ఆగ్రహముయొక్క అతిశయేన ఎక్కువచేతనున్ను విరహభరేణ విరహభారముచేతనున్న సా=ఆనాయిక ; సపది=యెల్లప్పుడున్ను ; తపతి=తపించుచున్నది. శ్రీ=శోభాయుక్తమయిన; వెలుగోటికుల వెలుగోటివారివంశమనే;అంబుధి=సముద్రమునకు; చంద్ర=చంద్రునివంటివాడా;శ్రితజన=ఆశ్రితజనులకు; హిత=యిష్టమైనవాడా ; బంగారేచేంద్ర=బంగారేచేంద్రుడనే పేరుగలవాడా తావకీలి=దావాగ్నియొక్క కీలా=జ్వాలావలెను పరుషేణ=కఠినమైన త్వరితగమన తొందరనడకచేతను; నిర్జిత=జయింపబడ్డ, పవనేన=వాయువుచేత; భావజ=మన్మథునియొక్క; చాప=ధనస్సువల్లనుండి, విగళితేన వదిపెట్టబడ్డ సుమభాణ పుష్పబాణములయొక్క నికరేణ సమూహముచేత బహుదీనతాం=విస్తారమైన దైన్యభావమును, ప్రాప్య=పొంది ॥తావన॥



అనుప. ప్రథితగుణహితాం ప్రథిత=పెద్దమైన, గుణహితాం=గుణములయందు యిష్టముగలిగినటువంటిన్ని, తవ=నీయొక్క, హితమేన=అనుకూలమునే, ఆత్మని=మనస్సుయందు, సదా=యెల్లప్పుడున్ను, అభిలషితాం=కోరుచుండేటటువంటి, తావకీన=నీయొక్క, మతి=బుద్ధికి విహితాం=ఇష్టురాలైన, సుచరితాం, యోగ్యచారిత్రముగల తాం=ఆనాయికను రమయ=క్రీడింపుము ;

నితాంత=ఎడతెగని; అతికరుణాం=మిక్కిలీదయను; కురు=చేయుము; తదుపరి=అటుతర్వాత; ధనేశ=కుబేరునివలెనే తత=విస్తారమగు వితరణధీ=దానబుద్ధిచే; నుత=స్తుతిచేయతగినవాడా, జనపతి=రాజులచేతను; కవి=కవీశ్వరులచేతను; పూజిత=పూజింపబడ్డవాడా; గుణమణి=గుణముల నేరత్నములకు, నిశాంత=నివాసమైనవాడా ; భరితశాంతా=నిండైన సాహసముగలవాడా ; సకల=సమస్తమయిన ; విబుధజన=పెద్దలయొక్క ; హృదయ=మనస్సులనే; కువలయ=కలువలకు; విధో=చంద్రునివంటివాడా ॥తావకీన॥

1\. సుదతి=నాయికయొక్క, ఖేదం=దుఃఖమును, వారయ=నివారింపుము, తస్యాం=దానియందు, మోదం=సంతోషమును;పరిపూరయ=నింపింపుము; సంవాదం=వివాదమును,దూరీకురు=దూరముగాచేయుము, సా=ఆనాయిక, అపరాధం=అపచారమును, రచయతినహి=చేయదుగదా॥ కారుణ్యేన=దయచేత, నిత్యం=అనుదినమున్ను, విలోకయ=చూడుము, హృది=మనస్సుయందు, తవ=నీయొక్క ; సాంగత్యం=సంగరమును, కామయతే=కోరుచున్నది ; వారిజాస్త్ర=మన్మథునితో, సమ=తుల్యమయిన, సుందర=చక్కదనముగల, విగ్రహ=శరీరముగలవాడా, గృహే=గృహమందు వసత్యపి=నివశించుచున్నప్పటికి,నిహిత=వుంచబడ్డ, మోహవశాత్=మోహావశంవల్లనుండిన్ని, శారికయా=గోరువంకతోటి,నవదతి=మాటాడదు, తస్యా=దానియందు, ఇహ=ఇప్పుడు, శాంతరసం=సహనరసమును, అంతరంగేణ, మనస్సుచేత, సహ=సహింపుము.

2. దీనావనజనపోషణా=దీనజనులను, రక్షించేటటువంటిన్ని, పోషణా=పోషించేటటువంటిన్ని, కవికీర=కవిశ్రేష్ఠులయొక్క, శ్రవణ=చెవులకు, విభూషణం=అలంకారమయినటువంటిన్ని, మానితబహురసపోషణా, మానిత=కొనియాడతగిన, బహు=విస్తారమయిన, రసపోషణం=రసపోషణ గలిగినటువంటిన్ని, తవభాషణం=నీయొక్క, మృదుమధురాలాపమును శ్రోతుం=వినుటకు, మనసీ=మనస్సునందు, ఇచ్ఛతి=కోరుచున్నది, మానయతామనురాగభరేణ, తాం=దాని, అనురాగభరేణ=అనురాగముతోగూడిన మనస్సుతో మానయ=మన్నింపుము, మందిరమానయసుఖమచిరేణ, మందిరం=ఆనాయికా కేళీగృహమునుగూర్చి, అచిరేణ=వేగమే, సుఖం=సుఖముగా, ఆనయ=రమ్ము, దానకర్ణ=వితరణమున కర్ణునివంటివాడా, తరుణీం=యౌవనమధ్యస్థమయిన, ఆనాయికను, ఉపలాలయ=లాలింపుము, తవహి=నీకుతగిన, సదృశరూపాం=సమానమయిన రూపంకల్గినదానను, అనుభావయ=అనుభవింపుము. సానతిమకరోత్ సా ఆనాయిక, నతిం=నమస్కారమును, అకరోత్=చేసేను, త్వం=నీవు, అవధారయ=అవధరింపుము, సారకరుణాశ్రయ, సార=శ్రేష్టమైనటువంటి, కరుణారస=దయారసమునకు, ఆశ్రయ=ఆశ్రయభూతుడా, సా=అది ॥తావకీన :—

3. సంగీతకళాసారదా, సంగీత=సంగీతమనెడు, కళా=విద్యకు, శారదా=సరస్వతియైనట్టిదియు, సా=ఆనాయిక, సకలలక్షణవిశారదా, సకల=సమస్తమైన, లక్షణ=లక్షణములయందు, విశారదా=నేర్పుకలదిన్ని, తల్పేసదా=పూలపాన్పున యల్లప్పుడున్ను, మదనసంగరేషు=మన్మథక్రీడలయందు, అంగీకురుతాంత్వమ్ముదా, తాం=ఆనాయికను, త్వం=నీవు, ముదా=సంతోషముచేత, అంగీకురు=అంగీకరింపుము, హేసఖి=ఓదూతీ శృంగారవతీం=ఆనాయికను, ఆనయేతి=తీసుకరమ్మని, మాంప్రతి=నన్ను గూర్చి, సంప్రతి=యిప్పుడు త్వం=నీవు వద=చెప్పుము, బంగారేచనృపతి=బంగారేచ మహారాజు, మామక=నాసంబంధమగు, అతిహితం=అతిప్రియమైన భాషణం=పలుకులను, శృణు=వినుము, అవనీనాయక=ఓమహారాజా, సంగమ క్షివాంఛయ సంభోగముకోసము, సుఖదాయకా సౌఖ్యమునొసంగువా



డా, అంగనాపాంగసుమసాయక, అంగనా=స్త్రీలయొక్క, అపాంగ=క్రేగంటిచూపులకు, సుమసాయక=మన్మథునివంటివాడా ॥తావకీన॥

## 81. బేహాగ్ రాగం, రూపకతాళము.

---

నాయికపరకీయ, ప్రౌఢ, అతృప్త, నాయకుడు అనుకూలుడు, సంభోగశృంగారము, కరుణారసము, అద్భుతరసము.

దైన్యము, విషాదము, శంక, శ్రమ, హర్షము, రతివిశేషములు, వితర్కము, నిర్వేదము, ఔత్సుక్యం, మోహము, ధృతి, స్మృతి, మతి.

పల్లవి. అంతలోనే తెల్లవారెనే అయ్యోయేమిసేతునే ॥నంతలో॥
దైన్యం, విషాదం, విషాదం, శంక, దైన్యం

అనుప. కాంతునిమనసెంతనొచ్చెనో యింతియెట్లుసైతునే ॥అంతలోనే॥
విషాదం, శంక, చింత, నిర్వేదం, దైన్యం, శంక, వితర్కం

1. పంతమునతటాన లేచి పైటచేరగుజారగా
విషాదం చింత, శంక
కాంతదొంతరవిడెమొసంగె క్రాగలింపుచుండగా ॥అంతలోనే॥
విషాదం, శంక, దైన్యం, రతివిశేషములు, మోహం, విషాదం, శంక, వితర్కం

2. కొదుమగుబ్బలెదనుగదియ నదుముకొనుచుచాలా
విషాదం, హర్షం ఔత్సుక్యం, మోహం
పెదవితేనెలాననా మదినితోచువేళా ॥అంతలోనే॥
మోహం, విషాదం స్మృతి, మతి, నిర్వేదం

3. సోమభూపాలరమ్మని భామప్రేమమీరగా
ఔత్సుక్యం దైన్యం, మోహం, హర్షం
కాముకేళిలోనమిగుల కలసిమెలసియుండగా ॥అంతలోనే॥
ఔత్సుక్యం, విషాదం రతులు, ధృతి, హర్షం
శంక, విషాదం, నిర్వేదం

## 82. సురటరాగం, ఆదితాళము.

నాయికసామాన్య, ఖండిత, కనిష్ట, నాయకుడు, వైశికుడు, మానవతి, ప్రణయమానవిప్రలంభశృంగారము, అద్భుతరసము, ఈర్ష్య, విషాదము, రోషము, అసూయ, అమర్షం, ఉగ్రత, దైన్యము, వితర్కము, ఔత్సుక్యము, హర్షము.

దానిబోధన వినవద్దుర నన్ను బాయన్యాయమా
అదినీకుప్రియమా నన్నేలరా బృహదీశ్వరా॥
వద్దజేరిముద్దుపెట్టవచ్చితే గద్దరించిమోమోరజేసేవుసామి
అదేరా భళిభళిరా ఔరౌర యిదిమేర పోపోరా॥
దానిబోధనవినవద్దుర ॥టీక॥
ఆనాయికయొక్క ఆలోచన ఆకర్ణించవద్దుర.
దానిబోధన యిందుకు;—

1. పతాకంచెవిత్తట్టున చూపి కనుబొమ్మలు పైకిఎగరవేయవలెను. హంసాస్యం చెవిరంధ్రమువద్దపట్టి సిరము కొంచెము వంచేది.

2. సూచీముఖం వెనుకకు చూపించి తర్వాత మృగశీర్షం చూపించి కపిత్థహస్తము చెవివద్ద త్రిప్పవలెను.

3. పతాకములతో ఒకవైపుకు కొట్టుతూ ముఖము పెడమర్లించి చిట్లించుచూ కపిత్థహస్తము నోటివద్ద విప్పవలెను.

4. కపిత్థహస్తముచే మెటికి విరిచినట్టుపట్టి హంసాస్యం యెదుట యీపక్కనుంచి ఆపక్కకు ఆడించవలయును.

5. మెటికెలు విరుస్తూ శివలింగహస్తముచే నూరుతూ అక్కడనే మాత్రలుజేసి అంగిట్లో వేసుకున్నట్లుగా చూపించవలెను.

6. మెటికెలు విరుస్తూ త్రిపతాకహస్తంబట్టి ఆకుకోసినట్టు కనువరచి ఆయాకు నలిపి రసంపిండి సిరస్సున అంటినట్టు పట్టవలెను.



దాని అనేచోట ఈర్ష్యచేత ఆస్త్రీయొక్క అవయవదూషణ చేయవలెను.

అది ఎట్లనగా;—

1. ఈడుతగనిది ॥యిందుకు.

(1) కర్తరీముఖముగాని అర్ధపతాకముగాని పట్టి పతాకములచేత నిషేధించేది.

(2) మృగశీర్షం ఎడమచేతనున్ను పతాకం కుడిచేతనున్ను ఎగుడు దిగుడుగాబట్టేది; పకపకనవ్వేది.

2. ముసలిది:—యిందుకు శరీరమందు అక్కడక్కడ ముకుళహస్తము బట్టి విప్పుచుండవలెను.

3. ముఖమువాడినది:—యిందుకు; పతాకముచేత ముఖము చూపి దైన్యమున్ను నిద్రయున్ను పట్టవలెను.

4. కన్నులు లోతుకుపోయినది:—యిందుకు, కన్నులు సూచీముఖముచేత చూపించి ఆసూచీముఖము చేతనే లోతుకుపోయినట్లు చూపేది.

5. బోసిది:—యిందుకు; శిఖరహస్తముచేత దంతములు చూపి పతాకముచేత లేదని చూపి నవ్వేది.

6. బొక్కిది అనగా చప్పిదవడలుగలది:—యిందుకు లాంగూలహస్తములో రెండుదవడలు యిమడవలెను.

7. కుచములు ఎండినది:—యిందుకు; పద్మకోశములచేత కుచములవద్ద పట్టి సందంశములచేత ఎండినవని చూపవలెను.

(ముఖమందు చిట్లింపు కనవడవలెను)

8. పీనమధ్య అనగా బలిసిన నడుముగలది యిందుక్కు నడుమును అర్ధచంద్రములతో పట్టి చూపించేది.

ముష్టిహస్తముపట్టేది ముఖమున చిరునవ్వు కన్నువికాస యీ రెండున్ను మిళితము కావలెను;—

యిట్లాటి అవయవదూషణ చేయవలెను యిట్టి అవయవ వికారములు వున్నప్పటికి దానియందు నాయకునకు కలిగియుండెడు అనురాగ అతిశయము యీ నాయిక చూచి సహించలేనుగనుక అసూయ అనే సంచారి పట్టినది.

ఆనాయకి యెట్టిదనగా ;

1. మందులమారి ॥యిందుకు—

కటకాముఖంగాని సందంశంగాని పతాకంలో నుండవలెను. కపిత్థహస్తముచేత యివ్వడమును చూపేది; యిందులో ముఖమందు దైన్యము వుండవలెను.

2. పదుగురిని కూడేది; ఇందుకు—

పది శిఖరహస్తములు పట్టి అర్ధపతాకం పట్టి ఆశ్చర్యమును పొందవలెను.

3. వట్టి బాసలమారి; యిందుకు—

ముకుళములు విసుకుదలగా జార్చి సర్పశీర్షముపైన పతాకముచేతగాని శిఖరముమీద పతాకముబెట్టిగాని నెత్తిమీద చెయ్యిబెట్టిగాని హంసాస్యం పట్టవలెను;

ఇక్కడ నాయకుని జూచి హేళనగా నవ్వేది.

4. దొంగవలపులది యిందుకు—

కటకాముఖముమీద ముకుళముపట్టి ఉత్సంగహస్తముబట్టి నాయకుని షట్కారములచే పొడవవలెను ముఖమందు దీనభావముమాత్రం విడువకూడదు.

N. B. ఉత్సంగహస్తమనగా:—

మృగశీర్షహస్తం వామహస్తమందు భుజముకు పైగాబట్టి ఆడించి కుచములను నిక్కబొడవవలెను.



5. క్రీశకుదొంగ ఇందుకు.

కర్తరీముఖం అర్ధపతాకం పట్టి నిషిద్ధహస్తంపట్టి మృగశీర్షం పట్టవలెను

N. B. { కటకాముఖముమీద ముకుళంపట్టిన యడల నిషిద్ధహస్తమగును. }

6. మాంత్రికురాలు; ఇందుకు—

మృగశీర్షం ముందుచూపించి పతాకం నోటివద్దబెట్టి వుండవలెను.

ఇట్లాటివి పట్టవలెను.

బోధనా అనగా మాట ఇందుకు,

కపిత్థహస్తము నోటివద్ద విప్పవలెను.

మాయ ఇందుకు కర్తరీస్వస్తికం పట్టవలను.

కర్తరీస్వస్తిక మనగా కర్తరీహస్తములు స్వస్తికముజేయగా కర్తరీ స్వస్తికమగును.

వినవద్దురా

వినవద్దురా 1 సామం } యిందుకు హంసాస్యం చెవి రంధ్రమందు పట్టి పతాకముచేత నిషేధించి బ్రతిమాలవలెను.

యీని షేధించడంవరకూ పట్టుతూ

1. ముద్దుబెట్టవలెను.

2. ఆలింగనము చేసుకొనవలెను.

3. శరీరమును దువ్వినట్టు పతాకములచేత పైనుంచి క్రిందికి రెండుమూడుసార్లు లాగవలెను.

2. (దానం) ఇందుకు

1. తనకుచములను దానమివ్వవలెను; ఇందుకు పద్మకోశములు కుచములవద్ద రెండుసార్లు వ్రాసి ముకుళములచేత దానమిచ్చెదనని చూపించవలెను.

2. హారములు యిచ్చెదనని చూపేది; యిందుకు సందంశములచేత హారములు చూపి మయూరహస్తముచేత వేశినట్టు అభినయించేది.

3. పూలదండలు వేసెదను అని యిందుకు పద్మకోశహస్తములు చక్రాకృతిగా చూపించి మయూరహస్తములచేత వేసెదనని చూపేది.

4. అధరామృతము పుచ్చుకోఅని యిందుకు శిఖరహస్తము అధరముకు చూపి అరాళహస్తముపట్టి రావోయిఅని పిలచినట్టు శిరము ఆడించేది.

5. అధరము పానంచేస్తావుఅని అడిగేది; యిందుకు శిఖరహస్తము మీద శిఖరహస్తము పొడిచి అధరమువద్ద పట్టి బాగావుంటుందా అని అడిగినట్టు శిరము ఆడించవలెను.

యీ రెండువుపాయములు చూచిచూచి వినివిని మొద్దువలె వూరుకున్నాడని వక్కసారి చూపించేది; యిక్కడ స్తంభమనే సాత్విక భావము పట్టవలెను.

3. (భేదం) యిందులో.

1. కన్నులెర్రజేయవలెను.

2. ముఖమందు బొమముడి వేయవలెను.

3. యిది తగదని పతాకములచేత బుగ్గలు పొడవవలెను.

4. యిది నీతికాదుఅని కోపించవలెను. యిందుకుపతాకములు వెనుకకులాగుకొని హంసాస్యంపైనుంచి క్రిందికి లాగి హంసపక్షకంచేత కూడదు అని కోపంచేది.

N.B. కోపము కన్నులవల్లను కనుబొమ్మలవల్లను కలుగును.

5. పతాకం పతాంకంలో తిరగవేసి నిష్టూర్యంగా కొట్టేది. దండనోపాయము యీపొగ్రకు పనికిరాదు కాబట్టి అదివల్లపడదు.



నన్ను బాయ ॥టీక॥ నన్ను వదిలిపెట్టుట.

యిందుకు

పతాకంగాని హంసాస్యంగాని మృగశీర్షంగాని రొమ్మున ఆని కర్తరీముఖంగాని అర్ధచంద్రంగాని కపోతంగాని సూచీముఖంగాని పతాకములుగాని కూర్చి విడదీయవలెను; వేటికవే వేరువేరుగా విడదీయవచ్చును; అట్లావిడదీయడంవల్ల పదిహస్తములుగాతేలును.

1. నన్నుమరచుట ॥యిందుకు॥

పతాకం రొమ్మున ఆని ముకుళములు జార్చుచూ కన్నులు మూయవలెను.

2. నన్ను యేచుట ॥యిందుకు.

మృగశీర్షం రొమ్మున ఆని దైన్యముతో ముకుళము రొమ్మున ఆని బ్రతిమాలినట్టు అగుపడవలెను.

న్యాయమా ॥టీక॥ ధర్మమా॥ యిందుకు.

1. హంసాస్యం పైనుంచి క్రిందికి లాగి మణిహస్తం వెతకలగా జాడిస్తూ శిరస్సు పైనుంచి ప్రశ్నగావూచవలెను.

2. సూచీముఖం ముందుకు నొకసారి ఒరగబట్టి హేళనచేసినట్టు పతాకము ఆడించవలెను.

3. పతాకములు పైకెత్తి నిష్టూర్యముగా పతాకములు ఆడిస్తూ చూడవలెను.

4. ముక్కున సూచీముఖం పట్టేది; రోషముతో నవ్వబోయేది.

అది ॥టీక॥ ఆనాయుక్తి.

యీమాటలకు పైనజెప్పిన స్త్రీవిషయములో తెలిసినన్ని అభినయిస్తూకర్కటకహస్తం పట్టుచుండవలెను.

ఏలాగనగా.

1. యూపుత్రగనిది (2) ముసలిది (3) ముఖమువాడినది (4) కన్నులులోతుకుపోయినవి (5) బోసిది (6) బొక్కిడి (7) కుచములుఎండినది (8) పీనమధ్య అనగా బలిసిన నడుముగలది యిట్లాటి అవయవదూషణ చేయవలెను.

సీకు ॥యిందుకు॥ సూచీముఖంగాని పతాకముగాని పొడిచినట్లు పట్టేది.

ప్రియమా ॥టీక॥ అనుకూలమా॥ యిందుకు

1. అలపద్మవం పట్టి శిఖరంచేత అడిగేది.

2. చతురములు పట్టి ఆడిస్తూ శిఖరంచేత ప్రశ్నగా అడిగేది.

3. పతాకములు పైకి రెండుమూడుసార్లు యెగరపట్టి శిఖరహస్తముచేత ప్రశ్నగా అడిగేది.

4. ఉత్సంగ హస్తము పట్టి పతాకములచేత తొందరగాను ఈర్ష్యగాను పొడవవలెను.

N. B. ఉత్సంగహస్తమనగా ఎడమకుడి బాహువులయందు కుడి ఎడమ సర్పసిరములుంచితె ఉత్సంగ హస్తమవును ఇది కౌగలింపుకు వొప్పును.

నన్నేలరా ॥టీక నన్ను పరిపాలించుమురా॥

ఇందుకు

1. పతాకమును రొమ్మున ఆని శిఖరహస్తం పట్టేది.

(ఇక్కడ దీనభావంగా కనపడవలెను)

అంతట

2. మృగశీర్షములు రొమ్మున ఆని శిఖరహస్తము పట్టవలెను.

3. హంసాస్యం రొమ్మునపట్టి శిఖరహస్తం పట్టేది.

(శిఖరహస్తము భర్తృభావమును తెలియజేయును)

4. పతాకము రొమ్మున ఆని సూచీముఖం త్రిప్పేది.



5. హంసాస్యం రొమ్మున ఆని సూచీముఖం త్రిప్పి చతురములచేత బ్రతిమాలినట్లు పట్టవలెను.

6. హంసాస్యం రొమ్మున ఆని పతాకములు పైకియెగదోసి అపతాకములచేత నాయకుని పొడవవలెను.

ఇక్కడ ఇచ్చిపుచ్చుకోవలెను.

ఇచ్చిపుచ్చుకోవడమనగా:—

1. విడెము పుచ్చుకొని ముద్దుబెట్టుమనుట.

ఇందుకు.

కటకాముఖముతోగాని సందంశంతోగాని విడెము లిచ్చినట్లు చూపుచు సూచీముఖంపట్టి సందంశంతో ముద్దుబెట్టుకొని మృగశీర్షంతో బిలిచి నవ్వవలెను.

2. నాఅధరము పుచ్చుకొని ఆలింగనము ఒకటి ఇమ్ము.

ఇందుకు

శిఖరంమీద శిఖరంనొక్కి హంసాస్యం పట్టి సూచీముఖంపట్టి వుత్సంగం పట్టేది సర్పశీర్షంచేత బుజ్జగించేది.

3. కుచములను పుచ్చుకో పకకేళిని దెల్పు.

ఇందుకు

పద్మకోశములు గుబ్బలవద్ద పట్టి ముకుళములచేత ఇచ్చి కన్నుసైగతో పుచ్చుకోమని కపిత్థహస్తము పట్టి కర్తరీముఖం పట్టి చతురములచేత బ్రతిమాలవలెను

4. మదనకేళికి ॥రాధా॥ ఇందుకు.

శిఖరహస్తంపట్టి కర్తరీస్వస్తికం పట్టి అతివేగము ముఖమున కనపడేటట్లు మృగశీర్షకములచే బిలువవలెను.

బృహదీశ్వరా ॥టీక॥ ఇది శివావతారము.

ఇందుకు పట్టవలసినవి:—

1. శిఖరహస్తం పతాకమందు పట్టవలెను.

2. బాణహస్తముపట్టేది.

3. బాణహస్తముపైని శిఖరహస్తము వుంచేది.

4. పతాకమందు శిఖరహస్తము వుంచేది.

(ఇదే శివలింగహస్తము అనబడును)

5. ఎడమవైపున మృగశీర్షం పట్టి కుడివైపున శిఖర హస్తము పట్టేది.

(ఇది అర్ధనారీశ్వరలక్షణం)

6. సర్పశీర్షములు పట్టి మయూరహస్తముచేత ముగించేది.

7. సింహముఖంగాని పూర్ణనాభంగాని పులికి పట్టి హంసాస్యంచేతగాని కపిత్థహస్తముచేతగాని కటకాముఖంచేతగాని కర్తరీముఖంచేతగాని వాలిచిశిఖరహస్తములచేతగాని మృగశీర్షములచేతగాని శరీరమును కప్పుకోవలెను.

(పులిచర్మధారి)

8. కర్తరీముఖంగాని త్రిపతాకంగాని జడలకృతిగా కనపర్చి హంసాస్యం పైనుంచి క్రిందికి లాగేది.

9. సింహముఖం పట్టి దానిపైన శిఖరహస్తం పట్టవలెను.

(వృషభవాహనుడు)

10. హంసాస్యం పైనుంచి క్రిందికి లాగి పతాకముచేత భస్మధారుడు అనిపట్టేది.

{శివునికి పట్టవలసినవి}
{మరివకమోస్తరు}



1. శివలింగహస్తము పట్టవలెను అదిపలాగసగా వామమందు అర్ధచంద్రముబట్టి దానిపైని శిఖరము పట్టేది.

2. రేఖాచంద్రహస్తము సిరస్సుయందు పట్టవలెను.

(ఇది బుడుతనెలదాల్పుకు వొప్పును)

3. త్రిపతాకం కదలిస్తూ పట్టి ముఖమందు చతురహస్తంచూపవలెను.

(ఇదిశగకన్నుగలవానికి వొప్పును)

4. ఆకాశగంగను ధరించినట్టుగా సిరస్సుయందు పద్మకోశం కనపర్చవలెను ఇది మిన్నువాకదాల్పుకు వొప్పును.

5. గరళమును కంఠమందు ధరించుటకు అరాళహస్తము పట్టి కంఠమువద్ద సందంశం క్రిందినుండి మీదికి కనపర్చవలెను.

(ఇది కరకంఠునికి వొప్పును)

6. త్రిశూలము ధరించుటకు త్రిపతాకం కనపర్చవలెను.

(ఇది ముమ్మొనవాలుదాల్పుకు వొప్పును)

7. వామమందు మృగశీర్షమున్ను దక్షిణమందు త్రిపతాకమున్ను పట్టవలెను.

8. వామహస్తము పద్మకోశం బట్టి కుడిచేత త్రిశూలమును ధరించినట్టుగా త్రిపతాకం బట్టితే.

(ఇదిఅర్ధనారీశ్వరునికి వొప్పును).

1. వద్దజేరి ॥టీక॥ దగ్గరప్రవేశించి॥

ఇందుకు.

చతురములు పట్టవలెను... మణిహస్తముతో ముగించేది ముఖమున సందేహం కనపడవలెను.

| ముద్దుబెట్టవచ్చితే॥ ఇక్కడనాయికచేసేపని— | గద్దరించి మోమోరజేసేపుసామి॥ యిక్కడనాయకుడుజేసేపని— |
|---|---|
| 1. సందంశహస్తము నోటివద్ద బెట్టి ముద్దిడి ముఖమున దైన్యంతో పతాకములు వెతకల వేయవలెను.<br>2. మాట్లాడబోతే॥ యిందుకు కపిద్ధహస్తము, నోటివద్దవిప్పి హంసాస్యం పైనుంచి లాగేది<br>3. నాయకుని దగ్గిరబిలువబోతే॥ యిందుకు.<br>శిఖరహస్తముబట్టి సూచీముఖముచేత ఆశిఖరహస్తమును కనపర్చి దానిపక్కనే మృగశీర్షంచేర్చి పతాకంచేత ముగించేది.<br>మణిహస్తము వెతకలగా జార్చేది.<br>మణిహస్తమనగా పతాకహస్తమందు అంగుళాలు ఇంచుక వంచితే మణిహస్తయగును.<br>4. నిన్నుముట్టుకోబోతే.<br>ఇందుకు.<br>పతాకముబట్టి వంచవలెను.<br>ఇక్కడ సందేహించినట్లుపట్టవలెను. | 1. కన్నులెఱ్ఱజేయవలెను.<br>హంసపక్షకములు పట్టవలెను.<br>అంజలి హస్తముచేత మొక్కేది.<br>యిక్కడ మరివకతీరుగా పట్టవలెను॥ ఏలాగనగా<br>ఆ అని కాలిమానము జంఘగా ముందుకు సాగించి ముఖమందు భీకరము చూపిస్తూ వూర్ణనాభహస్తములు రెండు కొద్దిగా వెనుకకు లాగవలయును<br>ఊర్ణనాభహస్తమనగా పద్మకోశహస్తమున అయిదువేళ్లకొనలు వుంచితే ఊర్ణనాభ హస్తమగును.<br>2. పిసుక్కొని చెక్కిళ్ళు మూసుకోనేవు.<br>ఇందుకు.<br>భ్రామముడివేసి పతాకములు రెండు చెక్కిళ్ళమీద వుంచవలెను.<br>3. తీవ్రదృష్టితో లేచిపోయెదవు. |



| ముద్దుబెట్టవచ్చితే॥ ఇక్కడనాయిక జేసేపని. | గద్దరించిమోమోరజేసేపుసామి॥ ఇక్కడ నాయకుడు చేసేపని. |
|---|---|
| 5. నిన్నుపట్టుకోబోతే<br>ఇందుకు.<br>సూచీముఖముబట్టి అర్ధచంద్రం ముకుళములోకి మార్చవలెను.<br>ఇక్కడతొందరవుండవలెను.<br>6. నీ అధరము ఆనబోతే॥<br>ఇందుకు.<br>పతాకము పొడిచి శిఖరము మీద శిఖరము పొడిచి సందంశం అధరోష్టముక్రింద పట్టి ధుతసిరస్సుచేత ఆడించవలెను. ధుతసిరస్సు అనగా ఎడమకుడిప్రక్కలయందు గదలించునట్టిసిరస్సు ధుతసిరస్సనబడును.<br>7. నిన్ను కౌగలించుకోబోతే<br>ఇందుకు<br>పతాకముచేత పొడిచి ఉత్సంగహస్తంచేత ఆలింగనము చేయవలెను. ఇక్కడదీనభావం కనపడవలెను. చేతులుసీరసముగా జార్చేది.<br>8. మరుకేళి గూడుమంటే.<br>ఇందుకు<br>కర్తరీస్వస్తికంబట్టి అర్ధపతాకం బట్టి కపిద్ధహస్తము నోటివద్ద విప్పేది | ఇందుకు.<br>కన్నులు సాచీదృష్టిపట్టి సూచీహస్తం ఆడించేది.<br>సాచీదృష్టి అనగా కడకంటిని జూచేది.<br>ఇందుకు.<br>4. అధరమును కొరుకుతూ అవతలకు ఈంగేవు.<br>ఇందుకు.<br>అధరముమీద పైదంతవరుస నొక్కకుంగేది లేక వొరిగేది.<br>5. తీవ్రముగ చెయ్యి వెనుకకు లాగుకోనేవు.<br>ఇందుకు.<br>చెయ్యి వెనుకకు లాగుకోనవలెను. ఇక్కడ తొందర వుండవలెను.<br>6. అయిష్టముగా అధరమును తుడిచి వేసుకోనేవు.<br>ఇందుకు—<br>కర్తరీముఖము పట్టి నోటిని పళ్ళు బిగించి అధరమును తుడిచివేసుకోవలెను.<br>7. ఆగ్రహముతో తోసివేసేవు<br>ఇందుకు |

| ముద్దుబెట్టవచ్చితే॥<br>ఇక్కడ నాయిక చేసేపని. | గద్దించి మోమోర జేసేవుసామి॥<br>ఇక్కడ నాయకుడు జేసేపని. |
| --- | --- |
| | అలపల్లవములు యెగుడు దిగుడుగా పట్టి ఆడించి కోపదృష్టితో చూస్తూ పతాకములచేత తోసివేయవలెను.<br>8 దొంగ నిట్టూర్పులిడుట.<br>ఇందుకు<br>కర్తరీముఖము బట్టి రొమ్ములు ఎగరవేయుచు పుశ్వాసనిశ్వాసలు వడిగా పట్టవలెను.<br>ఇక్కడ శ్రమలక్షణం కనపడవలెను. |

నాయిక చేసే యెనిమిదింటికి జవాబులుగా నాయకుడు యీపనులు చేసినాడు.

అదేరా ॥టీక॥ అదేనురా॥

ఇక్కడ,

1. ముఖమును కన్నులను వికాస కనపడవలెను.

2. ఇక్కడ చిరునవ్వుతో పద్మకోశహస్తముచేతనోరు మూసుకుని నవ్వేది.

3. ఇక్కడ అర్ధచంద్రం చెక్కిళ్ళమీద పట్టి నవ్వేది.

4. గడ్డమున సూచీముఖం పట్టేది.

5. ముక్కున వేలు వేసుకుని ఆశ్చర్యపొయ్యేది.

భళిభళిరా ॥టీక॥ శెబాష్ శెబాషురా.



ఇందుకు

1. సూచీముఖములచేత ఆడించేది.

2. బుగ్గమీద సూచీముఖము పట్టేది.

(వికాసము మానవద్దు)

3. అలపల్లవములు ముందునుంచి వక్రాకృతిగా ముఖమందు చిరునవ్వుతో తల ఆడించి పట్టవలెను.

4. కాలియొక్క గతితోటి సమముగా సూచీముఖము ముమ్మాటు ఆడించుచూ సిరఃకంపముకూడాచేయవలెను.

5. కనుబొమలు ఎగరవేయవలెను.

అవురవురా ॥టీక॥ అవును అవునురా॥

ఇందుకు

నిష్టురముగా అలపల్లవములు ఆడించేది.

వికాస మానవద్దు.

ఇదిమేరా ॥టీక॥ యీపని మర్యాదా॥

యిందుకు

1. మణిహస్తము వెతకలగా జార్చుతూ హంసపక్షకం ముఖమునకు అడ్డంపట్టి శిఖరహస్తముచేత ప్రశ్న చేయవలెను. ముఖమున ప్రశ్న లక్షణం కనపడవలెను.

2. పతాకములు జార్చి మృగశీర్షములు ముఖమున చాటుపెట్టి శిఖరహస్తముచేత అడిగేది.

3. ఎడమచేతిని పతాకం వెతకలగా జార్చి కుడిచేతిని హంసాస్యం పైనుంచి క్రిందికి లాగవలెను. (నిష్టురముగా పతాకములు జార్చేది.)

4. పతాకము ఎడమచేతిని జాచ్చి మణిహస్తములు పట్టి ఆడించి శిఖరహస్తముచేత పరీక్ష చేసేది.

ఐషారా ॥టీక॥ వెళ్ళువెళ్ళరా॥

యిందుకు

1. కటకాముఖముచేత చిటికె వేస్తూ పతాకముచేత నిషేధించేది.
2. పతాకములచేత నిషేధిస్తూ వెనకముఖము పెట్టవలెను.
3. విసుకుగా ఆభాషణముగా వుండవలెను.

అభాషణమనగా మాటలాడక వుండవలెను.

4. కన్నులను అశ్రువులు విడువవలెను.
5. ఈర్ష్యతో నిట్టూర్పులిడుతూ నాయకుని చూచేది.
6. పతాకములో పతాకమువేసి కొట్టేది.
7. కర్కటహస్తముచేత ఎగతాళి చేసేది.

(కర్కటహస్తమనగా ఊర్ణనాభహస్తముయొక్క వ్రేళ్ళసందులయందు రెండవచేతివ్రేళ్ళను చొప్పించి పట్టినయెడల కర్కటహస్తమగును. దీనికి విష్ణువు అధిదేవత.)

8. సూచీముఖములచేత మెద్దును తోలినట్టుతోలేది.

9. చాలుచాలును నీధోరణి తెలిసినది అని చెక్కిళ్ళమీదపతాకము దువ్వి ధుతసిరస్సుతో నోటను నిష్ఠురధ్వనిచేయవలెను.

{ధుతసిరస్సు అనగా యెడమ కుడిదిక్కులయందు వెల్లనే కదలించుటవల్ల ధుతసిరస్సు అగును. ఇచ్ అని అనుటవల్ల నిష్ఠురద్వని కలుగును.}

10. పతాకములు చప్పట్లుగా కొట్టవలెను.



☞ యీపదములో వచ్చు నాయిక రస శృంగారములయొక్క విరళములు.

సామాన్య అనగా ద్రవ్యదానమాత్రము నిమిత్తముగా సకలపురుషులయందు ననురాగముగలది.

ఖండిత ॥అనగా॥ ప్రియునియందు అన్యస్త్రీ సంగమచిహ్నలను జూచి ఈర్ష్యను బొందునది మరిన్ని నన్యోపభోగచిహ్నితుండై ప్రాతఃకాలమందు వచ్చిన నాయకుని జూచి కోపించునది మరిన్ని అన్యకాంతాసక్తుడై నభర్తను దండించేది.

దీనికి చేష్టలు ఆరు.

1. దృఢములేని మాటలాడుట.
2. విచారము.
3. కాకనొందుట-కాక అనగా కోపము.
4. నిట్టూర్పులుచ్చుట.
5. తెలతెలబోయి యూరకుండుట.
6. కన్నీరు నించుట.

యీనాయికకుపనులు.

కనిష్ట ॥అనగా॥ స్వల్పపతీ స్నేహము గలది.

నైశికుడు ॥అనగా॥ సకలవేశ్యోప భోగరసికుండు.

మానవతి ॥అనగా॥ నాయకుడు జేసిన నేరమును సూచించునాగ్రహముగలది.

అద్భుతరసము ॥అనగా యెన్నడున్న చూడనిది దృష్టమొనప్పుడు పుట్టును.

దీనికి అనుభావములు

| | |
|---|---|
| 1. ప్రసన్నమైన ముఖరాగము. | 4. తల కదలించుట. |
| 2. నేత్రవిస్తారము. | 5. కపోలప్రదేశముకదలించుట. |
| 3. రెప్పపాటులేకయుండుట. | కపోలమనగాగండస్థలముచెక్కిలి. |

మానవిప్రలంభశృంగారమనగా చూచుట ఆలింగనము మొదలైనవానిని నిరాకరించుటవల్ల కలుగునది.

యీమానవిప్రలంభము రెండువిధములు.

1. ప్రణయమానమనిన్ని } రెండువిధములు
2. ఈర్ష్యామానమనిన్ని }

ఈర్ష్యామానవిప్రలంభశృంగారమనగా—

అన్యస్త్రీ సంభోగము నెరుగుటచే ప్రియునియందు గలుగు కోపము ఈర్ష్యామానమనబడును.

యిందుకు

1. ఆభాషణము (2) ఉపాలంభము (3) బెదరించుట (4) కొట్టుట (5) వైముఖ్యము (6) కన్నీరు (7) ఓర్వమి యివి మొదలైనవానిచే నెరుగదగినది.

దీనినెరుగుట; వినుట చూచుట అనుమానము యీమూటిలో దేనివల్లనైనా నగును.

1. అభాషణము అనగా మాటలాడకపోవుట.

2. ఉపాలంభము అనగా దూషణతోగూడిన హాస్యము.

5. వైముఖ్యము ॥అనగా॥ ముఖము పెడగా ద్రిప్పుట.

7. ఓర్వమి ॥అనగా॥ ఓర్వలేనితనము.

ఈర్ష్యయనగా నాయకునియొక్క అన్యాసక్తిచే గలిగిన మనోవికారము.



మానము॥ అనగా॥ కోపము.

☞ వేడుకొనుటకు లేక ప్రార్థించుటకు మొదలగు భావములకు పట్టవలసిన హస్తముల వివరము.

1. ప్రార్థించుటకు పుష్పపుట హస్తము పట్టవలెను.
2. డిటో—అర్ధచంద్రములు రెండున్ను చాచి తల ఆడించవలెను.
3. డిటో—అంజలిహస్తము బట్టి తల ఆడించవలెను.
4. బ్రతిమాలుటకు ముకుళహస్తము బట్టి తల ఆడిస్తూ బ్రతిమాలవలెను.
5. డిటో—లాంగూలహస్తము బట్టి తల ఆడిస్తూ బ్రతిమాలవలయును.

---

మంగళము.

సురటురాగం, మిశ్రగతి-చాపుతాళము.

---

ప. పా, పాపా॥ పపా-పమపా॥ సనా-నీధా॥ పపా-రీమా॥
మా, కుం॥ మున-ఇకిపా॥ వర-మొస॥ గిన-నీకు॥
పా,-దానిధపా॥ ,,,-మాపధ॥ పా,-మగగరి॥ ,,, సా,,॥
మం,-గలఅళం॥ ,,,-శుభఅ॥ మం,-గఅళం॥ ,,,-ం,,॥

అ. రీ,-మామా॥ పా,-నీసా॥ రిమా-రీసా॥ నిధా-నిసరీ॥
మా,-కుల॥ బ్రో,-చిన॥ మద-నజ॥ నక-నీఇకు॥
సా,-నిధపా॥ ,,,-మాపధ॥ పా,-మగగరి॥ ,,,-సా,,॥
మం,-గఅళం॥ ,,,-శుభఅ॥ మం,-గఅళం॥ ,,,-ం,,॥

చ. 1. మదగజ-గమనమా-నితసద్గు-ణానీకు॥ మంగళం శుభ-మంగళం.
మదమోహ-రహితమం-జులరూప-ధరనీకు॥ మంగళం-శుభ-మం-
2. మనసిజ-వైరిమా-ననపద-నానీకు॥ మంగళం-శుభ-మంగళం.
మనవిని-వినిమ-మ్మేలుకొ-న్ననీకు॥ మంగళం-శుభ-మంగళం.
3. మామన-మున నెల-కొన్నకృ-ష్ణనీకు॥ మంగళం శుభ-మంగళం.
మామనో-హరపా-లిత త్యా-గరాజ॥ మంగళం-శుభ-మంగళం.

మంగళం.

సౌరాష్ట్రరాగం, ఆదితాళము.

---

పాధనీస-దానిదపా-పమధపపమ-గమగరిరీ-సాసనిధా-సారీ
నీనాఆఅ-మఅఅఅ-రుఉఉఉపఅ-ముఉలఅకు-నిత్యఅఅ-జ
రీ-మాధపామ-గమగరి-గమపమ ॥౧॥ పాధనిసాదా-దానిధపా-సా
య-మంగఅఅళంంం-ంంంం ॥౧॥ నీనఅఅఅ-మఅఅఅ-ని
సనిధా-నిసరిస'సరిగరి-గమపధపమ గమపమ-పధనిపమ ॥౨॥
త్యఅఅ-జఅఅఅ-యఅఅఅ-మంంంంం-గఅఅఅ-ళంంంంం ॥౨॥
సాధనిధనిసాని-దానిధపా-గమపమరీ ॥౩॥ పాధనిసారిసధా ॥౪॥
నీనఅఅఅఅఅ-మఅఅఅ-మఉనఅకు ॥౩॥ నీనఅఆఅఅఆ ॥౪॥
దధసాసా-రిరిరి సారిగరి-ససా ॥౧॥ సిధపమ-ధాసాసా ॥౨॥ సా
పదమాన-సుతుడు-పఅఅట్టు-ఉఉ ॥౧॥ వఅవఅ-మాఆన ॥౨॥ పా
సాసా-ససిసారి సనీ-నీస-దానానిదపమ ॥౧॥ నీసా-నీసా-నీసా॥
దాఅ-రఅఅఅఅ-విందమ-ములకుఉఉఉ ॥౧॥ పాఅ-దాఆ-ఆఆ॥
౨॥ నీసరిం-నిసరీస ॥౩॥ సిసరిగరిస-నిసరిగరిస ॥౪॥ దాదాసరి
౨॥ పఅఆఅ-దఅఆఅ ॥౩॥ పఅఅఅఅఅ-దఅఅఅఅఅ ॥౪॥ పవమఅ
గమగమగరిరీస ॥౫॥ పదనిధపమ-పధనిసరిస-నిదసిధపా॥ నపము
అఅఅఅఅఅనఅ ॥౫॥ నిఇఇఇఇఇ-నఅఅఅఅఅ-మఅఅఅఅ ॥క్ర్తా-హా
రములు-నటియించు-నురమునకు ॥నీ॥ నళినారి-తీరుగేరు-నవ్వుమోము
నకు ॥నీ॥ పంకజాక్షి-నెలకొన్న-అంక-యుగమునకు ॥నీ॥ ప్రహ్లాద-నారదా
ది-భక్తులు పొగడుచుండే ॥నీ॥ రాజీవనయన త్యాగ-రాజవినుతమైన ॥నీ॥

రెండవభాగమునందుక్షేత్రియపదములకు
అభినయము లక్ష్యముచేస్ని
౩ వ అధ్యాయము
సమాప్తము



శ్రీరస్తు.

హస్తాది దృష్టిభేదములు.

---

4 అధ్యాయము ప్రారంభము

హస్తన్యాసాదులచే పదములయర్థములను వ్యక్తముగా దెలియ జేయునది అభినయమనబడును.

అది

1. అంగికము (2) వాచికము (3) ఆహార్యము (4) సాత్వికము అని నాలుగువిధములు.

1. అంగములచేజూపబడునది అంగికమనబడును.

2. మాటలచేరచింపబడునది వాచికమనియనదగును.

3. హారకేయూరాదులచే నలంకరించుకొనుట ఆహార్యమనదగును.

4. సాత్వికాదిభావములచే అభినయించుట సాత్వికమనందగును.

నృత్యము; శిరోభేద, దృష్టిచేద, గ్రీవాభేద, హస్తభేదంబులం బరగుచుండును.

9 అందు శిరోభేదములు.

1. సమము; (2) ఉద్వాహితము; (3)అధోముఖము; (4)అలోళిత ము; (5) ధుతము; (6) కంపితము; (7) పరావృత్తము; (8) ఉత్క్షిప్తము (9) పరివాహితములని 9 విధములు.

1. సమములనగా; తలనువంచక, పొడవుగానెత్తక, కదలింపక, స మముగానిలుపుట సమమనబడును.

(దీనిని, నృత్తారంభము మొదలగువానియం దుపయోగించునది)

2. ఉద్వాహితము; శిరస్సును, ఊర్ధ్వభాగమునకెత్తి, ఆపిదవ, సమ ముగానుంచుట (దీనిని, ధ్వజము మొదలగువానియందుపయోగించునది)

3. అధోముఖము; క్రిందిపక్కగా శిరస్సును వంచుట; దీనిని, సిగ్గు మొదలగువానియందుపయోగించునది.

4. ఆలోళితము; శిరస్సును, చక్రాకారముగా త్రిప్పుట.

(దీనిని, గాఢనిద్ర మొదలగువానియం దుపయోగించునది)

5. ధుతము; ఎడమకుడిపక్కలయందు శిరస్సును కదలించుట;

(దీనిని, లేదనుట మొదలగువానియం దుపయోగించునది)

6. కంపితః—మీదు, క్రిందుగా శిరస్సును గదలించుట.

(దీనిని, కోపము మొదలగువానియం దుపయోగించునది)

7. పరావృత్తము,—పక్కగా శిరమును దిప్పుట;

(దీనిని, అట్లుచేయుమనుట మొదలగువానియం దుపయోగించునది)

8. ఉత్క్షిప్తము=పొడవుగానెత్తబడిన, శిరస్సు రెండుపక్కలగదలించుట దీనిని, చేకొనుము మొదలగువానియం దుపయోగించునది.

9. పరివాహితము=రెండుపక్కలను, చామరమువలె శిరమువంచబడుట దీనిని, వలచుట మొదలగువానియం దుపయోగించునది.

8 దృష్టి భేదములు.

1. సమము; (2) ఆలోకితము; (3) సాచి; (4) ప్రలోకితము; (5) నిమీలితము; (6) ఉల్లోకితము; (7) అనువృత్తము: (8) అవలోకితము; అని యెనిమిదివిధములు—అందు

1. సమము; తప్పపాటులేకుండునట్లు, దేవతాస్త్రీలవలె, సమముగా జూచెడుచూపు సమమనబడును.

(దీనిని, నాట్యారంభము, మొదలగువాటియం దుపయోగించునది.



2. ఆలోకితము=త్వరగా కనుబొమ్మలను, చక్రాకారముగా త్రిప్పి వ్యక్తముగా చూచునట్టి దృష్టి ఆలోకితమనబడును.

(దీనిని, కుమ్మరవాని చక్రముచుట్టుట, మొదలగువానియం దుపయోగించునది.)

3. సాచి=దృష్టి స్వస్థానమందే నిలిచి, కడకంటివరకు చలనక్రమువలన చలించుట సాచిదృష్టియనబడును.

(దీనిని అభిప్రాయము మొదలగు వానియం దుపయోగించునది.)

4. ప్రలోకితము=చూపులు రెండుపక్కల కడవరకుకదలించుట,

(దీనిని; సన్న జేయుట మొదలగువానియందుపయోగించునది)

5. నిమీలితము=సగముకన్ను నుదెరచుట; (దీనిని ఋషి వేషము మొదలగువానియందుపయోగించునది)

6. ఉల్లోకితము=దృష్టినిపైకిప్రసరింపజేసి, క్రిందికివంచుట; (దీనిని ధ్వజాగ్రము, మొదలగువానియందుపయోగించునది)

7. అనువృత్తము=అతిశీఘ్రముగా క్రిందుమీదుగాజూచుట.

(దీనిని, కోపముతో జూచుట, మొదలగువానియం దుపయోగించునది)

8. అవలోకితము= క్రిందుగాజూచుట; దీనిని, నీడజూచుట, మొదలగువానియందుపయోగించునది.

4 గ్రీవాభేధములు.

1. సుందరి; (2) తిరశ్చీన; (3) పరివర్తిత; (4) ప్రకంపిత; అని నాలుగువిధములు. అందు—

1. సుందరి అనగా; అడ్డముగా మెడకదల్చుట.

(దీనిని స్నేహారంభము, మొదలగువానియం దుపయోగించునది.

2. తిరశ్చీన; రెండుపక్కల నూర్ధ్వభాగములయందు సర్పగతివలె, మెడకదలించుట. దీనిని కత్తినిదిప్పుట, మొదలగువానియం దుపయోగించునది.

3. పరివర్తిత; రెండుప్రక్కల అర్ధచంద్రాకారముగా మెడకదల్చుట; (దీనిని శృంగారనటనము మొదలగువాని యందుపయోగించునది.)

4. ప్రకంపిత; ముందు వెనుకగా, పావురమువలె మెడను కదలించుట; (దీనిని, నీవనుట, మొదలగువానియందు పయోగించునది.)

హస్తభేధములు.

అసంయుతములు, సంయుతములుఅనిహస్తభేధముద్వివిధము.

28 అందుఅసంయుతములు.

1. పతాకము; (2) త్రిపతాకము; (3) అర్ధపతాకము; (4) కర్తరీముఖము; (5) మయూరము; (6) అర్ధచంద్రము; (7) అరాళము; (8) శుకతుండము; (9) ముష్టి; (10) శిఖరము; (11) కపిత్థము; (12) కటకాముఖము; (13) సూచీముఖం; (14) చంద్రకల. (15) పద్మకోశము; (16) సర్పశీర్షము; (17) మృగశీర్షము; (18) సింహాముఖము; (19) లాంగూలము; (20) సోలపద్మము; (21) చతురము; (22) భ్రమరము, (23) హంసాస్యము (24) హంసపక్షము; (25) సందంశము; (26) ముకుళము; (27) తామ్రచూడము (28) త్రిశూలము; అనియిరవదియెనిమిది తెరగులగును. అందు—

1. పతాకహస్తలక్షణము.



అన్నివేళ్ళనుచాచి బొటనవ్రేలిని వంచిపట్టునది పతాకహస్తమని నృత్యశాస్త్రవిశారదులు చెప్పుదురు.

నాట్యారంభము, మేఘము, వనము, వస్తువులనునిషేధించుట, కుచస్థలము, రాత్రి, నది, దేవసమూహము, అశ్వము, ఖండించుట, వాయువు, శయనము, గమనము, ప్రతాపము, ప్రసాదము, చంద్రిక, మిక్కిలి యెండకాయుట, తలుపుతట్టుట, ఏడువిభక్తులు, అల, వీధిలోప్రవేశించుట, సమముగానుండుట, గంధముప్రూయుట, తాననుట, పంతము, ఊరకుండుటను తోపించుట, ఆశీర్వాదించుట, గొప్పరాజునుచూపించుట,



తాటాకు, చెంపపెట్టు, పదార్థమునుస్పృశించుట, అక్కడనే యక్కడ నేయనుట, సముద్రము, సుకృతిక్రమము, సంబోధనము, ముందుగా బోవువాడనుట, కత్తియాకృతినిజూపుట, మాసము, సంవత్సరము, వర్షము, దినము, సమ్మార్జనము, (అనగాతుడుచుట) ఈఅర్థములయందు ఈహస్తమువినియోగపడును.

2. త్రిపతాకహస్తలక్షణము.



ముందుచెప్పిన పతాకహస్తమందలి అనామిక అనగా చిటికినవ్రేలికి ముందువ్రేలు వంచబడునేని, యదిత్రిపతాకహస్తమగును. ఇది; కిరీటము, ఇంద్రుడు, చెక్కిలి, మకరికాపత్రిరేఖ, స్త్రీపురుషులచేరిక, అగ్నిజ్వాలపైకిలేచుట మొదలగువాటికి వినియోగబడును.

3. అర్ధపతాకహస్తలక్షణము.



త్రిపతాకహస్తమందు, చిటికెనవ్రేలు, వంచబడునేనిఅర్ధపతాకహస్తమగును. ఇది, చిగురు, పలక, గట్టు, ఇద్దరినిచెప్పుట సూరికత్తి, రంపము, ధ్వజము, గోపురము, కొమ్ము వీనియందు ఈహస్తము వినియోగబడును.

4. కర్తరీముఖహస్తలక్షణము.



అర్ధపతాకహస్తమందలి, చిటికెనవ్రేలును, చూపుడువ్రేలును, బైటకిచాచబడునేనికర్తరీముఖహస్తమగును. ఇది, స్త్రీపురుషులయెడబాటు, వ్యత్యస్తస్థానము దొంగిలించుట కడకన్ను, చావు, భేదించుట, మెరపు, ఒకవానుపునందలి పడకపట్లనెడబాయుట, క్రిందపడుట, తీగె, వీనియందు ఈహస్తముపయోగించును.

5. మయూరహస్తలక్షణం.



కత్తరీముఖహస్తమందు, అనామికను, అంగుష్ఠముతో జేర్చి తక్కినవేళ్ళను చాచిపట్టినయెడలమయూరహస్తమగును. ఇదినెమలిముఖము, తీగె, పక్షి, క్రిక్కట, ముంగురులు దిద్దుట, నొసలు, తిలకము, కన్నీరు, ఎగజిమ్ముట, శాస్త్రమునువ్యవహరించుట, ప్రసిద్ధి, వీనియందు ఈహస్తముపయోగించును.

6. అర్ధచంద్రహస్తలక్షణము.



పతాకహస్తమందు, అంగుష్ఠము చాచబడినయెడల, అర్ధచంద్రహస్తమగును. ఇది, కృష్ణాష్టమిచంద్రుడు, మెడపట్టిగెంటుట, దేవాభిషేకము, కంచము, పుట్టుక, మొల, చింత, తన్నుదానుజెప్పుకొనుట, ధ్యానము, ప్రార్థించుట, సలాముచేయుట, అవయవములను, వీనియందుపయోగపడును.

7. అరాళహస్తలక్షణం.



పతాకహస్తమందు, చూపుడువేలు వంపబడినయెడ, అరాళహస్తమగును. ఇది, జలము, అమృతము, మొదలగువానిని త్రాగుటయందును, గాలియందును, ఈహస్తముపయోగబడును.



8. శుకతుండహస్తలక్షణము.



ముందుజెప్పిన అరాళహస్తమందు, అనామికవంపబడునేని శుకతుండహస్తమగును;—ఇది సదాశివునివలన, పార్వతీదేవికిన్ని, ప్రణయకలహము గలిగినప్పుడు, పార్వతీదేవియందు పుట్టెను. (ఇది బ్రహ్మాస్త్రము, మొగముతుద, వంకర, వస్తువులమార్పు, భిందవాలము, ఆయుధము, దాటుట, కలహము, ప్రీతిలేమి, ప్రణయకలహము, అభిప్రాయము, విడుపు, ఈటె, చిలుక, గోరువంకలను జూచుట, ఉగ్రభావము, మర్మోక్తి, నడవబోవువిషయము, తామ్రపర్ణము, వీనియందీహస్త ముపయోగించును.

9. ముష్టిహస్తలక్షణం.



నాలుగువేళ్ళనుజేర్చి, యరచేతిలోనికివంచి, అంగుష్ఠమును మీదజేర్చునెడ, ముష్టిహస్తమగును; ఇది, స్థిరమనుట, సిగపట్టుట, దృఢత్వము, పదార్థముల నుంచుకొనుట, జగడము, వీనియందు, యీహస్తముపయోగించును.

10. శిఖరహస్తలక్షణం.



ముందుజెప్పిన ముష్టిహస్తమందు, అంగుష్ఠమును పొడవుగానెత్తినయెడ శిఖరహస్తమగును:—దీనిని, మన్మథుడు, ధనస్సు, స్తంభము, శబ్దములేమి, పితృతర్పణము, పెదవి, పెనిమిటి, దంతము, ప్రవేశించుట, ప్రశ్నచేయుట, అవయవము, లేదనుట, తలచుట, నీచ్చుట, ఇతరాభినయము, నడికట్టు, కౌగలింత, ప్రియుడు, శక్త్యాయుధము, తోమరాయుధము, వానిని ప్రయోగించుట, ఘంటానాదము, వీనియందుపయోగించును.

### 11. కపిత్థహస్తలక్షణం.



ముందుజెప్పిన శిఖర హస్తాంగుష్ఠమందు, చూపుడు వ్రేలు వంపబడునేని కపిత్థహస్తమగును:— దీనిని, లక్ష్మీదేవియందును, సరస్వతియందును, చుట్టుట, తాళమును పట్టుట, పాలుపిదుకుట, కాటుక పెట్టుకొనుట, పూలచెండ్లుధరించుట, కొంగు మొదలగు వానిని పట్టుకొనుట, గుడ్డముసుగు వేసుకొనుట, ధూపదీపార్చనము, వీనియందు, ఈహస్తముపయోగింపబడును:—

### 12. కటకాముఖహస్తలక్షణము.



ముందుచెప్పినకపిత్థహస్తమందు, చూపుడు వ్రేలును నడిమివ్రేలితోను. బొటన వ్రేలితోను జేర్చిపట్టబడునేని కటకాముఖహస్త మగును దీనిని, పువ్వులుకోయుట, ముత్యాలదండ, పూలదండలుధరించుట, బాణమును మెల్లగా ఆకర్షించుట, ఆకుమడుపులిచ్చుట, కస్తూరిమొదలగుద్రవ్యములనుకలుపుట. వాసనద్రవ్యములుచేర్చుట, మాట, చూపు, వీనియందీహస్త ముపయోగపడును.

### 13. సూచీముఖహస్తలక్షణము.



ముందుచెప్పిన కటకాముఖహస్తమునందలి, చూపుడు వ్రేలుపొడవుగా చాపబడినయెడల సూచీముఖహస్తమగును. దీనిని. ఒకటిఅను అర్థము, పరబ్రహ్మము, తలపు, నూరుఅనుట, సూర్యుడు, నగరము, లోకముఅనుఅర్థము, అల్లాఅనుట, ఎవడు, ఎవతె, ఏదీఅనుట, వాడు, ఆమె, అదియనుట, విసనకఱ్ఱ, వెరపించుట, కృశించుట. సలాక, దేహము, ఆశ్చర్యపడుట, జడనుచూపుట, గొడుగు, నేర్పరితనము, మూలఅనుట, నూగారు, భేరీవాయించుట, కుమ్మరవానిచక్రము తిరుగుట, బండిచక్రము సమూహము, వివరించుట, సాయంకాలము వీనియందీహస్తముపయోగపడును.



### 14. చంద్రకలాహస్తలక్షణము.



ముందుచెప్పిన సూచీహస్తమందు, బొటనవ్రేలిని, విడిగావుంచినయెడల చంద్రకలాహస్తమగును, ఈచంద్రకలాహస్తము కలామాత్రు చంద్రునియందు ప్రయోగించును.

### 15. పద్మకోశహస్తలక్షణం



అయిదువ్రేళ్ళను ఎడముగాచాచి, కొంచమువంచి అరచేయిపల్లమగునట్లుపట్టబడునెడ, పద్మకోశహస్తమగును; దీనిని, మారేడుపండు, వెలగపండు, స్తనములు, వటువ్రపువ్వుచెండు, అల్పాహారము, పూమొగ్గ, మామిడిపండు పూలవాన, పూలగుత్తి, మొదలగునది. మంకెనపువ్వు, ఘంటారూపమునుజూపుట, పాములపుట్ట, నల్లకలువ, గుడ్డు, వీనియందీహస్తముపయోగపడును.

### 16. సర్పశీర్షహస్తలక్షణము.



పతాకహస్తముయొక్క అరచెయ్యికొంచెము పల్లముగావంపబడినయెడల, సర్పశీర్షహస్తమగును. దీనిని, గంధము, పాము, మెల్లగాననుట, నీళ్ళుచిలకరించుట, పోషించుట మొదలగునవి, దేవర్షితర్పణములు, ఏనుగుకుంభస్థలముచరచుట, జెట్టీలుభుజముచరచుట, వీనియందీహస్తముపయోగపడును.

### 17. మృగశీర్షహస్తలక్షణం.



ముందుజెప్పిన సర్పశీర్షహస్తమందలి, చిటికెనవ్రేలును, బొటనవ్రేలును చాచబడునేని, మృగశీర్షహస్తమగును, దీనిని, స్త్రీవిషయము, చెక్కిలి, క్రమము, మర్యాద, వెరపు, వాదు, అలంకారము, ఉనికిపట్టు విబూదిపెట్టుకొనుట, ఎదురెదురు, ముగ్గు, ఇల్లు, కాళ్ళుపిసుకుట, అన్నిటినికూర్చుట, గొడుగుపట్టుకొనుట, అడుగుపెట్టుట, మెట్టు, ప్రియులనుబిలుచుట, తిరుగుట, వీనియందీహస్తముపయోగించును.

### 18. సింహముఖహస్తలక్షణం.



నడిమివ్రేలు, వుంగరమువ్రేలు, ఈరెండువ్రేళ్లకొనలను, బొటనవ్రేలితోజేర్చి, తక్కినవ్రేళ్లనుచాచి, పట్టినయెడ, సింహముఖహస్తమగును; దీనిని, పగడము, ముత్యము, మంచివాసన, ముంగురులుదిద్దుట, నీటిబొట్టు, వినుట, (రొమ్ముననిలిపినయెడ) మోక్షవిషయము, హోమము, కుందేలు, ఏనుగు, దర్భనువిదలించుట, తామరపూలదండ, సింహముయొక్క మొగము, వైద్యుడుమందువండుటను శోధించుట, వీనియందీహస్తముపయోగించును.

### 19. లాంఙ్గూలహస్తలక్షణం.



పద్మకోశహస్తమందు ఉంగరపువ్రేలు వంచిపట్టినయెడ లాంఙ్గూలహస్తమగును; దీనిని, గజనిమ్మపండు, పడుచులచన్నులు, చకోరము, వాసనగల మెట్టకలువ, పోక, చిరుగజ్జెలు, రసగుండు, మొదలగునవి. చాతకపక్షి వీనియందీహస్తముపయోగపడును.



### 20. సోలపద్మహస్తలక్షణం.



చిటికెనవ్రేలుమొదలగువ్రేళ్ళు, సందులుగలవిగా త్రిప్పిపట్టినయెడ సోలపద్మహస్తమగును; దీనిని, విరిసినతామర, తిరుగుడు, వెలగపండు, చన్ను, ఎడబాటు, అద్దము, పూర్ణచంద్రుడు, అందమైనపాత్రము, కొప్పు, మేడమీదియిల్లు, ఊస, ఎత్తు, కోపము, చెరువు, బండి, చక్రవాకపక్షి, కలకలధ్వని, మెప్పు వీనియందీహస్తముపయోగపడును.

### 21. చతురహస్తలక్షణం.



తర్జనిమొదలైన మూడువ్రేళ్ళనుజేర్చి చాచి, అంగుష్ఠమును, అనామికమూలమునం దడ్డముగనుంచి పట్టునది చతురహస్తమగును. కస్తూరి, కొంచెమనుట, బంగారు, రాగిమొదలగు లోహములు, తడి, ఖేదము, రసముతాగుట, మెల్లగనడచుట, తునుక, ఎత్తుపీట, నేయి, నూనె, మొదలగు ద్రవ్యవస్తువులు. వీనియందీహస్తముపయోగించును.

### 22. భ్రమరహస్తలక్షణం.



నడిమివ్రేలిచేత, బొటనవ్రేలిని, తాకి, చూపుడువ్రేలిని వంచి, తక్కినరెండువ్రేళ్ళను చాచిపట్టినయెడల భ్రమరహస్తమగును. తుమ్మెద, చిలుక, యోగాభ్యాసము, బెగ్గురుపక్షి, కోయిల మొదలైన పక్షులు వీనియందీహస్తముపయోగించును.

## 23. హంసాస్యహస్తలక్షణము.



నడిమివ్రేలు మొదలుమూడువేళ్ళను, ఎడముగలవిగా, చాచి, చూపుడువ్రేలిని, బొటనవ్రేలితో చేర్చిపట్టిన యెడల హంసాస్య హస్తమగును; బొట్టుపెట్టుట, ఉపదేశము, నిశ్చయము, గగుర్పాటు, ముత్యముమొదలైనవి, చిత్రమువ్రాయుట, అడవియీగ, నీటిబొట్టు దీపపువొత్తినెగసనద్రోయుట, ఒరయుట, శోధించుట మల్లెమొగ్గలుమొదలైనవి, గీతగీయుట, పూలదండ, రూపించుట, నేనేబ్రహ్మమనుట, లేదనుట, ఒరసిచూడదగినవస్తువులను భావించుట, సిద్ధముగానున్నదనుట, వీనియందీహస్తముపయోగించును.

## 24. హంసపక్షహస్తలక్షణము.



సర్పశీర్షహస్తమునందలి చిటికెనవ్రేలినిచాచి, పట్టినయెడ హంసపక్షహస్తమగును. ఆరుఅనెడిలెక్క, కట్టకట్టుట, గోటినొక్కుగురుతు, ఏదేనొక పనిచేయుట, వీనియందీహస్తముపయోగించును.

## 25. సందంశహస్తలక్షణము.



ముందుచెప్పినపద్మకోశహస్తమువ్రేళ్ళను, మాటిమాటికిచేర్చివిడిచి పట్టినయెడ సందంశహస్తమగును. త్యాగమిచ్చుట, బలియిచ్చుట, పుండు, పురుగు, మనస్సునందలి భయము, అర్పించుట, అయిదుఅనుట, వీనియందు ఈహస్తముపయోగించును.



## 26. ముకుళహస్తలక్షణము.



అయిదువ్రేళ్ళనుజేర్చి, యెదుట చూపునట్లు పట్టబడునది ముకుళహస్తమనబడును. కలువపువ్వు, మన్మథుడు, భోజనము చేయుట, ముద్రలుధరించుట, బొడ్డు, అరటిపువ్వు, వీనియందీహస్తముపయోగపడును.

## 27. తామ్రచూడాహస్తలక్షణం.



ముకుళహస్తమునందలి తర్జనీవ్రేలును వంచిపట్టినయెడల తామ్రచూడాహస్తమగును, కోడిమొదలైనవి, కొంగ ఒంటె, దూడ, వ్రాయుట, వీనియందీహస్తముపయోగించును,

## 28. త్రిశూలహస్తలక్షణము.



బొటనవ్రేలిని, చిటికెనవ్రేలినివంచి, తక్కినవ్రేళ్ళను చాచి పట్టినయెడ, త్రిశూలహస్తమగును. దీనిని, మారేడుపత్రి, మూటకూడిక, వీనియందు ఈహస్తము వినియోగించును.

☞ ఈచెప్పబడినయిరువది యెనిమిది హస్తములున్ను అసంయుతహస్తములనబడును. ఈహస్తములయుపయోగార్థములు ఎన్నిగలవో అన్నిహస్తభేదములుగలవు అని చెప్పుదురు.

### గ్రంథాంతరే ఊర్ణనాభహస్తలక్షణము.

పద్మకోశహస్తము వ్రేళ్లను వంచిపట్టినయెడ ఊర్ణనాభహస్తమగును, ఇదిపూర్వకాలమందు నృసింహస్వామి, హిరణ్యకశిపుని, రొమ్మును నఖములచేత చీల్చునపుడు, నృసింహస్వామివలన బుట్టెను. క్షత్రియజాతి. ఋషి శార్దూలకుడు, రక్తవర్ణము, ఆదికూర్మము, అధిదేవత, తలగోకుకొనుట, దొంగతనము, కోతి, నరసింహుడు, మృగముఖము, సింహము, తాబేలు, కొండగోగు, స్తనము, భయము, క్షత్రియజాతి, ఎఱ్ఱవన్నె, సాలెపురుగు వీనియందు ఈహస్తముచెల్లును.

### గ్రంథాంతరే బాణహస్తలక్షణం.

చూపుడువ్రేలు మొదలు మూడువ్రేళ్లను చేర్చి, బొటనవ్రేలిని, కొంచెమునోకునట్లు, చిటికెనవ్రేలిని చాచి పట్టినయెడల బాణహస్తమవును; ఇది, ఆరుఅని లెక్కపెట్టుటయందును, నాళనృత్యమునందును వినియోగించును.

### గ్రంథాంతరే అర్ధసూచికహస్తలక్షణం.

కపిత్థహస్తపు చూపుడువ్రేలు పొడవుగాయెత్తి పట్టబడినయెడల అర్ధసూచికహస్తమగును; మొలక, పక్షిపిల్ల మొదలగునది. పెద్దపురుగు వీనియందీహస్తముపయోగించును.

### అథచతుర్వింశతి సంయుతహస్తానిరూప్యతే

### సంయుతహస్తములు 24 విధములు.

1 అంజలి; 2 కపోతము, 3 కర్కటము, 4 స్వస్తికము, 5 డోల 6 పుష్పపుటము; 7 ఉత్సంగము, 8 శివలింగము, 9 కటకావర్ధనము, 10 కర్తరీస్వస్తికము, 11 శకటము, 12 శంఖము, 13 చక్రము, 14 సంపుటము, 15 పాశము, 16 కీలకము, 17 మత్స్యము, 18 కూర్మము, 19 వరాహము, 20 గరుడము, 21 నాగబంధము, 22 ఖట్వా, 23 భేరుండము, 24 అవహిత్థము, అనునీ యిరువదినాలుగు హస్తములు, సంయుత హస్తములని భరతశాస్త్రమునందు చెప్పబడియున్నది.

☞ రెండు అసంయుతహస్తములనుజేర్చి పట్టినయెడల నొకసంయుతహస్తమవును. ఆసంయుతహస్తములకు ఉత్పత్తి, జాతి, ఋషి మొదలగునవి ఒకటిగానేయుండినను, అధిదేవతలుమాత్రము భేదపడియుండును.



### 1. అంజలిహస్తలక్షణం.

రెండు పతాకహస్తములను అరచేతిలోజేర్చిన నది అంజలిహస్తమగును. దీనిని, దేవతలకును, గురువులకును, బ్రాహ్మణులకును, నమస్కారముచేయుటయందు ఈహస్తముచెల్లును. అందు, దేవతలకు మ్రొక్కునపుడు శిరస్సునందును, గురువుకు మ్రొక్కునపుడు ముఖమందును, బ్రాహ్మణులకు మ్రొక్కునపుడు రొమ్మునందును క్రమముగా నొప్పును. మఱియు, నమస్కరించుట, వినయముతో వంగుట, తాళము వేయుట, శివస్వరూపమును నిరూపించుట, ఏమిచేయుదునని యనుట ధ్యానముచేయుట వీనియందు ఈహస్తముచెల్లును.

### 2. కపోతహస్తలక్షణం.

ముందుజెప్పిన అంజలిహస్తము మొదలుతుదలు, పార్శ్వభాగములు చేరియుండ పట్టబడినయెడల కపోతహస్తమగును; దీనిని, ప్రమాణము, పెద్దలతోమాటలాడుట, వినయముతో నొప్పుకొనుట, వీనియందు ఈహస్తముచెల్లును.

### గ్రంథాంతరస్థకపోతహస్తలక్షణం.

అంజలిహస్తము, ఎడమైనవ్రేళ్ళుగలదిగా బట్టినయెడల కపోతహస్తమగును. దీనిని, అంగీకారము, టెంకాయ, పోక, వృక్షము మొదలగునవి, అరటిపూవు, చలి, అమృతము, వస్తువులనుసంగ్రహించుట సంపుటము, మాదఫలము వీనియందీహస్త ముపయోగించును.

### 3. కర్కటహస్తలక్షణం

ముందుజెప్పిన కపోతహస్తమందు, వ్రేలివ్రేలిసందునను, వ్రేళ్లుజొప్పించి, వెలికిగాని, లోపలికిగాని, చాచినట్టుపట్టునెడల కర్కటహస్తమగును. దీనిని. గుంపునుజూచుట, లావైనదానిని జూచుట, శంఖనాదముజేయుట, దేహాలస్యము పోగొట్టుకొనుట, చెట్టుకొమ్మనువంచుట, వీనియం దుపయోగించును.

### గ్రంథాంతరస్థకర్కటహస్తలక్షణం.

ఊర్ణనాభహస్తముయొక్క వ్రేళ్లసందులందు, రెండవచేతివ్రేళ్లనుజొప్పించి పట్టినయెడల కర్కటహస్తమగును; దీనికివిష్ణువు అధిదేవత, దీనిని, దుఃఖవచనములాడుట, ఆవులింత, కొట్టుట, ఎంప్రికాయ, శంఖమును ఊదుట, స్త్రీలు మెటికెలువిరుచుట, వీనియం దుపయోగించును.

### 4. స్వస్తికహస్తలక్షణం.

రెండుపతాకములయందలి మణికట్టులను జేర్చిపట్టినయెడల స్వస్తికహస్తమగును. (మొసలినిదెలుపుట, భయముతోమాట్లాడుట పొగడుట, వాదమాడుట, వీనియందీహస్త ముపయోగించును.)

### 5. డోలాహస్తలక్షణం.

రెండు పతాకహస్తములను తొడమీదికి వ్రాలునట్లు పట్టినయెడల డోలాహస్తమగును; ఇది నాట్యారంభమునందు వినియోగింపదగినదని, నాట్యశాస్త్రజ్ఞులు చెప్పుదురు.

### గ్రంథాంతరస్థడోలాహస్తలక్షణం.

పతాకహస్తములు ఇరుపార్శ్వములందు వ్రాలునట్లు పట్టినయెడల డోలాహస్తమగును. దీనికి దేవతసరస్వతి, దీనిని మోహము మూర్ఛ, మదము ఆలస్యము, విలాసము మొదలగువాటికి పట్టవచ్చును.



### 6. పుష్పపుటహస్తలక్షణం.

రెండుసర్పశీర్షహస్తములయొక్క మణికట్టు మొదళ్ళు చిటికెనవ్రేలివరకుగల అరచేతివెలుపలభాగములను జేర్చిపట్టినయెడల పుష్పపుటహస్తమగును, దీనిని కర్పూరహారతి, బిడ్డలు, పండ్లు, మొదలైనవానినిదీసికొనుట, సంధ్యాకాలమందు అర్ఘ్యప్రదానముజేయుట మంత్రపుష్పమిచ్చుట వీనియందీ హస్తముపయోగించును.

### గ్రంథాంతరస్థ పుష్పపుటహస్తలక్షణం.

సర్పశీర్షహస్తము యొక్కపార్శ్వమందు రెండవచేతిసర్పశీర్షమునుజేర్చిపట్టినయడల పుష్పపుటహస్తమగును దీనికి కిన్నరేశ్వరుండు అధిదేవత పువ్వులు, ధాన్యము పండ్లు మొదలగునవి ఇచ్చి పుచ్చుకొనుటయందును అర్ఘ్యప్రదానమునందును యీహస్తముపయోంపవలెను.

### 7. ఉత్సంగహస్తలక్షణం.

రెండు మృగశీర్షహస్తములను మూపులుసోకేటట్టు పట్టినయెడల ఉత్సంగ హస్తమగును, కౌగలింత, సిగ్గు, భుజకీర్తులు మొదలగువానిని జూపుట, బాలురనుశిక్షించుట, వీనియందు ఈహస్తముపయోగించును.

### గ్రంథాంతరస్థ ఉత్సంగహస్తలక్షణం.

అరాళహస్తములను మూపులయందుజేర్చి పట్టునెడ ఉత్సంగహస్తమనబడును. అధిదేవత, గౌతముడు; కౌగలింత, సిగ్గు, అంగీకారము, చలి, మేలనుట, చన్నులనుకప్పుట మొదలగువానియం దీహస్తముపయోగించును.

### 8. శివలింగహస్తలక్షణం.

ఎడమచేతి అర్ధచంద్రహస్తమందుశిఖరహస్తముంచబడెనేని శివలింగహస్తమగును, ఇది శివలింగమును జూపుటయం దుపయోగించును.

## 9. కటకావర్ధనహస్తలక్షణం.

కటకాముఖహస్తములయొక్క మణికట్లు స్వస్తికముగాజేర్చి పట్టినయెడల, కటకావర్ధన హస్తమగును; పట్టాభిషేకము, పెండ్లి, దీవన వీనియందీహస్త ముపయోగించును.

### గ్రంథాంతరస్థకటకావర్ధన హస్తలక్షణం.

కటకాముఖహస్తములను స్వస్తికముగా పట్టినయెడల కటకావర్ధనహస్తమగును; ఇది, విచారము, శృంగారము, కోపసమాధానము, జక్కిణిఅను ఆట, కోలాటము, నిశ్చయము, వీనియందీహస్త ముపయోగించును.

## 10. కర్తరీస్వస్తిక హస్తలక్షణము.

కర్తరీముఖహస్తములను స్వస్తికాకారముగాబట్టినయెడల కర్తరీస్వస్తికహస్తమగును. ఇది చెట్టుకొమ్మలు పర్వతశిఖరము, వృక్షములు వీనియందీహస్తముపయోగించును.

## 11. శకటహస్తలక్షణము.

భ్రమరహస్తములు రెండును బొటనవ్రేలిని నడిమివ్రేలినిచాచిపట్టినయెడల శకటహస్తమగును. ఇదిరాక్షసులు మొదలైనవారల అభినయమునందుచెల్లును.

## 12. శంఖహస్తలక్షణం.

శిఖరహస్తములోపలియంగుష్టముతో రెండవచేతియంగుష్టముచేర్చి తక్కినవ్రేళ్ళను ఆశిఖరహస్తములపైకి చాచిపట్టినయెడల శంఖహస్తమగును; ఇది శంఖముమొదలైన వానియందుపయోగించును.

## 13. చక్రహస్తలక్షణం.

అర్ధచంద్రహస్తములను అడ్డముగా రెండుఅరచేతులను జేర్చి పట్టినయెడల చక్రహస్తమగును. ఇదిచక్రార్థమందు చెల్లును.



## 14. సంపుటహస్తలక్షణం.

ముందుజెప్పిన చక్రహస్తపు వ్రేళ్లనుముడిచి పట్టినయెడల సంపుట హస్తమగును.

ఇది, వస్తువులను దాచుటయందును, ముడువబడిన దానియందును ఈహస్తముచెల్లును.

## 15. పాశహస్తలక్షణము.

సూచీహస్తముల చూపుడువ్రేళ్ళనువంచిచేర్చిపట్టినయెడల పాశహస్తమగును. పరస్పరకలహములందును, త్రాటియందును, సంకెలయందును ఈహస్తముచెల్లును.

## 16. కీలకహస్తలక్షణం.

మృగశీర్షహస్తముల చిటికెనవ్రేళ్లనువంచి చేర్చిపట్టినయెడల కీలక హస్తమగును. స్నేహమందును ప్రియవచనమునందును ఈహస్తముపయోగించును.

## 17. మత్స్యహస్తలక్షణము.

పతాకహస్తములు ఒకటిమీదనొకటిగజేర్చి చిటికెనవ్రేళ్ళను బొటనవ్రేళ్ళను, కొంచెముచాచిపట్టినయెడల మత్స్యహస్తమగును ఇది మత్స్యావతారమునందుచెల్లును.

## 18. కూర్మహస్తలక్షణం.

చక్రహస్తము మొనవ్రేళ్ళనువంచి చిటికెనవ్రేలినిబొటనవ్రేలిని చాచిపట్టినయెడల కూర్మహస్తమగును.

ఇది తాబేటియొక్క అర్థమునందు ఉపయోగించును.

## 19. వరాహహస్తలక్షణం.

మృగశీర్ష హస్తమును ఒకటిమీదనొకటిజేర్చి చిటికెన బొటనవ్రేళ్ళనుకూడ బట్టబడినయెడల వరాహహస్తమగును. ఇది పందియొక్క అర్థమందు వినియోగించును.

### 20. గరుడహస్తలక్షణం.

అర్ధచంద్రిహస్తములు రెండును అడ్డముగాబొటనవ్రేళ్ళుచేరికతోపట్టబడినయెడల గరుడ హస్తమగును. ఇది గరుడని అర్థమందుపుపయోగించును.

### 21. నాగబంధహస్తలక్షణము.

రెండుసర్పశీర్ష హస్తములు మనికట్టులుచేర్చిపట్టినయెడల నాగబంధహస్త మగును. ఇదిపాములపెనసంటి రతిబంధమందును, పాములపెనయందును, పొందరిండ్లనుజూపుట యందును అధర్వణమంత్రిమునందును ఈహస్తముపయోగించును.

### 22. ఖట్వాహస్తలక్షణం.

చతురహస్తముపైచతురహస్తముపుంచి చూపుడువ్రేలిని బొటనవ్రేలిని చాచిపట్టినయెడల ఖట్వాహస్తమగును ఇది మంచము మొదలైనవానియందుపయోగించును.

### 23. భేరుండహస్తలక్షణము.

కపిత్థహస్తములు రెండుమనికట్టులతోను జేర్చిపట్టబడినయెడల భేరుండహస్తమగును ఇది భేరుండపక్షిదంపతులయందుపయోగించును.

### 24. అవహిత్థహస్తలక్షణం.

రెండుఅలపద్మహస్తములు, రొమ్మునకెదురుగా బట్టబడినయెడల అవహిత్థ హస్తమగును; ఇది శృంగారనటనము, పుట్టచెండును పట్టుట, స్తనముయొక్కఅర్థము వీనియందుపయోగించును.

### గ్రింథాంతరస్థావహిత్థలక్షణం.

శుకతుండహస్తములు క్రిందనుండి, హృదయాభిముఖముగబట్టబడినయెడల అవహిత్థహస్తమగును ఇదిబలహీనత, దేహము చిక్కి-



యుండుట, సంతోషము, చిక్కినది,వీనియందీహస్తముపయోగించును.

ఈవిధముగా సంయుత హస్తములయొక్క నామలక్షణములు చెప్పబడియెను.

## బాంధవ్యహస్తములు.

### 1. దంపతీహస్తలక్షణం.

ఎడమచేత శిఖరహస్తమును, కుడిచేతమృగశీర్ష హస్తమును పట్టినయెడల దంపతీహస్తమగును భార్యాభర్తలయందు ఈహస్తముపయోగించును.

### 2 మాతృహస్తలక్షణం.

ఎడమచేత, అర్ధచంద్రిహస్తమును, కుడిచేతసందంశహస్తమును, నాభికెదురుగాపట్టి ఆహస్తమునుద్రిప్పి, పిమ్మట వామహస్తమందు స్త్రీహస్తమును బట్టినయెడల, మాతృహస్తమగును. తల్లికిని కొమార్తెకును ఈహస్తముపయోగించును.

### 3. పితృహస్తలక్షణం.

ముందుచెప్పినమాతృహస్తము కొనయందు కుడిచెయ్యి శిఖరహస్తముగాబట్టబడినయెడల పితృహస్తమగును.

తండ్రియందును అల్లునికిన్ని ఈహస్తముపయోగించును.

### 4. శ్వశ్రూహస్తలక్షణం.

కంఠమందు హంసాస్యహస్తమునుంచి, కుడిచేత బట్టబడిన సందంశహస్తమును నాభికెదురుగాద్రిప్పి ఎడమచేత స్త్రీహస్తమునుపట్టినయెడల శ్వశ్రుహస్తమగును ఈహస్తము అత్తకుచెల్లను.

### 5. శ్వశురహస్తలక్షణం.

ముందుజెప్పబడిన శ్వశ్రుహస్తముకుడితట్టు శిఖరహస్తముగలుగబట్టబడినయెడల శ్వశురహస్తమగును ఈహస్తము మామకుచెల్లును.

### 6. భర్తృభ్రాతృహస్తలక్షణం.

ఎడమచేతశిఖరహస్తమునుబట్టి రెండుపార్శ్వములయందును కుడిచేత కర్తరీముఖహస్తము పట్టినయెడల భర్తృభ్రాతృహస్తమగును ఇది పెనిమిటితోడబుట్టినవారియందుపయోగించును.

### 7. ననన్దాహస్తలక్షణం.

ముందుజెప్పబడిన భర్తృభ్రాతృహస్తముపట్టినపిదప స్త్రీహస్తము దక్షిణహస్తమందుపట్టినయెడల ననన్ధాహస్తమగును, ఈహస్తము ఆడుబిడ్డయందుపయోగించును.

### 8. జ్యేష్ఠకనిష్ఠభ్రాతృలక్షణం.

మయూరహస్తము ముందుప్రక్కను వెనుకప్రక్కను బట్టినయెడల జ్యేష్ఠభ్రాతృకనిష్ఠభ్రాతృహస్తమగును. ఈహస్తము అన్నదమ్ములయందుపయోగించును.

### 9. స్నుషాహస్తలక్షణం.

ముందుజెప్పినజ్యేష్ఠాకనిష్ఠహస్తమునుపట్టి పిమ్మటకుడిచేత స్త్రీహస్తమును పట్టినయెడల స్నుషాహస్తమగును. ఈహస్తము కోడలియందుపయోగించును.

### 10. భర్తృహస్తలక్షణం.

కంఠమందు హంసాస్యహస్తములనుంచి కుడిచేతశిఖరహస్తము పట్టినయెడల భర్తృహస్తమగును ఈహస్తము మగనియందుపయోగించును.

### 11. సపత్నీహస్తలక్షణం.

పాశహస్తమునుచూపి రెండుచేతులయందును స్త్రీహస్తములనుపట్టినయెడల సపత్నీహస్తమగును. ఈహస్తముసవతియందుపయోగించును.



ఈరీతిగాపదునొకండు బాంధవ్యహస్తములు చెప్పబడినవి. ఇందుచెప్పబడని బంధువులకు వారివారి క్రియల ననుసరించి హస్తములను తెలుసుకోవలయును.

## దశావతారహస్తములు.

### 1. మత్స్యావతారహస్తలక్షణం.

మత్స్యహస్తమును జూపి రెండు త్రిపతాకహస్తములను భుజశిరస్సులకు సమముగాబట్టినయెడల మత్స్యావతారహస్తమగును. ఇది మత్స్యావతారము కుపయోగించును.

### 2. కూర్మావతారహస్తలక్షణం.

కూర్మహస్తమునుజూపి భుజశిరస్సులకు సమముగా త్రిపతాకహస్తములు పట్టినయెడల కూర్మావతారహస్తమగును. ఇది కూర్మావతారము కుపయోగించును.

### 3. వరాహావతారహస్తలక్షణం.

వరాహహస్తమునుజూపి, పిరుదులయందు హస్తములనుంచునెడ వరాహావతారహస్తమగును; ఇది వరాహావతారము కుపయోగించును.

### 4. నృసింహావతారహస్తలక్షణం.

ఎడమచేత సింహముఖహస్తమును, కుడిచేత, పతాకహస్తమునుబట్టినయెడల నృసింహావతారహస్తమగును. ఇది నృసింహావతారము కుపయోగించును.

### 5. వామనావతారహస్తలక్షణం.

మీదుగాను క్రిందుగాను ఎడమకుడిచేతులచే రెండుముష్టిహస్తములు పట్టినయెడల వామనావతారహస్తమగును.

ఈహస్తము వామనావతారము కుపయోగించును.

6. పరశురామావతార హస్తలక్షణం.

ఎడమచేతిని నడుమునందుంచి, కుడిచేత అర్ధపతాకహస్తమునుబట్టినయెడల పరశురామావతార హస్తమగును.

ఈహస్తము, పరశురామావతారము కుపయోగించును.

7. రఘురామావతారహస్తలక్షణం.

కుడిచేత కపిద్ధహస్తమును, ఎడమచేత శిఖరహస్తమును క్రిందుమీదులుగా పట్టినయెడల రామచంద్రావతార హస్తమగును.

8. బలరామావతారహస్తలక్షణం.

కుడిచేత పతాకహస్తమును, ఎడమచేత ముష్టిహస్తమును పట్టినయెడల బలరామావతార హస్తమగును.

9. కృష్ణావతారహస్తలక్షణం.

రెండు మృగశీర్షహస్తములు భుజసిరస్సుల సమీపమున ఎదురెదురుగా పట్టబడినయెడల కృష్ణావతారహస్తమగును.

10. కల్క్యావతారహస్తలక్షణం.

కుడిచేత పతాకహస్తమును, ఎడమచేత త్రిపతాకహస్తమును బట్టినయెడల కల్క్యావతారహస్తమగును.

రాక్షసహస్తలక్షణం.

రెండు చేతుల చేముఖమునందు శకటహస్తము పట్టబడెనేని రాక్షసహస్తమగును.

చతుర్వర్ణహస్తములు.

1. బ్రాహ్మణహస్తలక్షణం.

రెండు శిఖరహస్తములను బట్టి కుడిచేత అడ్డముగా జంధ్యము నుజూపునెడ బ్రాహ్మణహస్తమగును.



2. క్షత్రియహస్తలక్షణం.

ఎడయుచేత శిఖరహస్తమును అడ్డముగాబట్టి, కుడిచేతపతాకహస్తము బట్టినయెడల క్షత్రియహస్తమగును.

3. వైశ్యహస్తలక్షణం.

ఎడమచేత హంసాస్యహస్తమును, కుడిచేత కటకాముఖహస్తమును పట్టినయెడల వైశ్యహస్త మగును.

4. శూద్రహస్తలక్షణం.

ఎడమచేత శిఖరహస్తమును కుడిచేత సూచీహస్తమును, పట్టినయెడల శూద్రహస్తమగును.

☞ పదునెనిమిదిజాతులకు, వారివారి క్రియలచే అందులకుతగినట్టు హస్తములు విన్యాసము చేసుకొనవలయును.

దేవతల హస్తలక్షణములు.

1. బ్రహ్మహస్తలక్షణం.

ఎడమచేత చతురహస్తమును, కుడిచేతహంసాస్యహస్తమును, బట్టినయెడల బ్రహ్మహస్తమగును.

2. శమ్భుహస్తలక్షణం.

ఎడమచేత, చతురహస్తమును, కుడిచేత త్రిపతాకహస్తమును బట్టినయెడల శంభుహస్తమగును.

3. విష్ణుహస్తలక్షణం.

రెండుచేతులను త్రిపతాకహస్తములు పట్టినయెడల విష్ణుహస్తమగును.

4. సరస్వతీహస్తలక్షణం.

కుడిచేత సూచీహస్తము ఎడమచేత, అర్ధచంద్రహస్తమును పట్టినయెడల సరస్వతీహస్తమగును.

5. పార్వతీహస్తలక్షణం.

కుడి ఎడమచేతులను మీదుకిందులుచేసి, అర్ధచంద్రహస్తములుగా పట్టినయెడల అభయవరదహస్తములగును. అవియేపార్వతీహస్తమగును.

6. లక్ష్మీహస్తలక్షణం.

బాహుమూలమందు రెండుకపిత్థహస్తములు పట్టినయెడల లక్ష్మీహస్తమగును.

7. విఘ్నేశ్వరహస్తలక్షణం.

ఎదురెదురుగాను రెండుకపిత్థహస్తములు పట్టినయెడల విఘ్నేశ్వరహస్తమగును.

8. షణ్ముఖహస్తలక్షణం.

ఎడమచేతియందు త్రిశూలహస్తమును, కుడిచేతియందు శిఖరహస్తమును బాహవుగా బట్టినయెడల షణ్ముఖహస్తమగును.

9. మన్మథహస్తలక్షణం.

ఎడమచేతియందు శిఖరహస్తమును, కుడిచేతియందు కటకాముఖహస్తమును బట్టినయెడల మన్మథహస్తమగును.

10. ఇంద్రహస్తలక్షణం.

రెండు త్రిపతాకహస్తముల మణికట్టులను చేర్చిపట్టునెడ ఇంద్రహస్తమగును.

11. అగ్నిదేవహస్తలక్షణం.

కుడిచేతియందు త్రిపతాకహస్తమును, యెడమ చేతియందు లాంగూలహస్తమును బట్టినయెడల అగ్నిదేవ హస్తమగును.

12. యమహస్తలక్షణం.

ఎడమచేతియందు పాశహస్తమును, కుడిచేతియందు, సూచీహస్తమును బట్టినయెడల యమహస్తమగును.



13. నైఋతిహస్తలక్షణం.

ఖట్వాహస్తమును, శకటాహస్తమునుబట్టితే నైఋతిహస్తమగును.

14. వరుణహస్తలక్షణం.

కుడిచేతియందు పతాకహస్తమును, ఎడమచేతియందు శిఖరహస్తమును బట్టినయెడల వరుణహస్తమగును.

15. వాయువహస్తలక్షణం.

కుడిచేతియందు అరాళహస్తమును, ఎడమచేతియందు అర్థపతాకహస్తమును బట్టినయెడల వాయుహస్తమగును.

16. కుచేరహస్తలక్షణం.

ఎడమచేతియందు పద్మహస్తమును, కుడిచేతియందు గదాహస్తమును బట్టినయెడల కుచేరహస్తమగును.

నవగ్రహహస్తములలక్షణం.

1. సూర్యదేవతాహస్తలక్షణం.

భుజశిరస్సుల సమీపములందు రెండుచేతులచే సోలపద్మకపిత్థహస్తములు పట్టినయెడల సూర్యహస్తమగుమ.

2 చన్ద్రహస్తలక్షణం.

ఎడమచేతియందు సోలపద్మహస్తమును, కుడిచేతియందు పతాకహస్తమును బట్టినయెడల చంద్రహస్తమగును.

3. అంగారకహస్తలక్షణం.

ఎడమచేత సూచీహస్తమును, కుడిచేతముష్టిహస్తమును బట్టినయెడల అంగారకహస్తమగును.

4. బుధహస్తలక్షణం.

ఎడమచేత నడ్డముగాముష్టిహస్తమును, కుడిచేతపతాకహస్తమును బట్టినయెడల బుధహస్తమగును.

5. బృహస్పతిహస్తలక్షణం.

హంసహస్తముచే శిఖరహస్తమును జంద్యమువలెబట్టి చూపినయెడల బృహస్పతిహస్తమగును. ఈహస్తము ఋషులయందును, బ్రాహ్మణులయందును చెల్లును.

6. శుక్రహస్తలక్షణం.

ఎడమపక్కమీదుగాను, కుడిపక్కక్రిందుగాను ముష్టిహస్తముపట్టినయెడల శుక్రుని హస్తమగును.

7. శనైశ్చరహస్తలక్షణము.

ఎడమచేత శిఖరహస్తమును, కుడిచేత త్రిశూలహస్తమును బట్టినయెడల శనైశ్చరహస్తమగును.

8. రాహుహస్తలక్షణం

ఎడమచేత సర్పశీర్షహస్తమును, కుడిచేతసూచీహస్తమును పట్టినయెడల రాహుహస్తమగును.

9. కేతుహస్తలక్షణము.

ఎడమచేత సూచీహస్తమును, కుడిచేత పతాకహస్తమునుబట్టినయెడ కేతుహస్తమగును.

1. సింహహస్తలక్షణం.

కుడిచేత సింహముఖహస్తమునుబట్టి, దానివెనుకతట్టు పతాకహస్తమును ఎడమైనవ్రేళ్లు గలుగబట్టిన నది సింహముఖహస్తమగును.

2. వ్యాఘ్రహస్తలక్షణం.

అర్ధచంద్రహస్తమును అధోముఖముగ బట్టినయెడ పెద్దపులియందు చెల్లును.

3. వృషభహస్తలక్షణం.

మధ్యమాఅనామికలను కొంచెము అరచేతితట్టునకువంచి, వానిమీద అంగుష్ఠమునుచేర్చి, తక్కిన రెండువ్రేళ్ళను చాచిపట్టినయెడల తలసింహహస్తమగును. ఇది వృషభార్థమందు వినియోగించును.



4. ధేనుహస్తలక్షణం.

నడిమివ్రేలినివంచి, తక్కినవ్రేళ్ళనుచాచి, పట్టినయెడ సంకీర్ణముద్రహస్తమగును, ఇది ఆవునందు, యంత్రభేదమునందును చెల్లును.

5. పారావతహస్తలక్షణం.

కపోతహస్తమును పుంఖితాకారముగ బట్టినయెడల పావురముకు చెల్లును.

6. కపోతహస్తలక్షణం.

కపోతహస్తమును అడ్డముగా బట్టినయెడ అడవిపావురముకు చెల్లును.

7. పికహస్తలక్షణం.

అరాళహస్తమును పుంఖితముగబట్టినయెడ పికహస్తమగును. ఇదికోయిలకుపయోగించును.

8. చాతకహస్తలక్షణం.

లాంగూలహస్తమును పుంఖితముగాబట్టినయెడల చాతకహస్తమగును. ఇది చాతకపక్షికిచెల్లును.

9. శుకహస్తలక్షణం.

శుకతుండహస్తమును పుంఖితాకారముగబట్టినయెడ చిలుకయందు వినియోగించును.

10. భ్రమరహస్తలక్షణం.

ఇతరమైన భ్రమరహస్తమును పుంఖితముగబట్టినయెడ తుమ్మెదయందు వినియోగించును.

11. మయూరహస్తలక్షణం

మయూరహస్తమును పుంఖితాకారముగ బట్టినయెడ నెమలియందు వినియోగించును.

12. హంసహస్తలక్షణం.

మునుపుచెప్పిన హంసాస్యహస్తమును. హంసపక్షియందు వినియోగించును.

### 13. చక్రవాకహస్తలక్షణం.

అలపద్మహస్తము పుంఖితములుగ బట్టిన యెడ చక్రవాకపక్షి యందుపయోగించును.

☞ మరియు, ఈహస్తాదిదృష్టిభేదంబులలో ననేకంబులుగలవు. వర్తమానకాలమందు అభినయమునకు అత్యావశ్యకమైన హస్తాది దృష్టిభేదంబులు మాత్రము గ్రంథంబున చేర్చి రచియుంచడమైనది. ఈహస్తాదిదృష్టిభేదములను గురించి తెలియుటకు ప్రత్యేకము గ్రంథముండుటచే విస్తరించి తిరుగవ్రాయుట నవసరంబని, యెంచి అవసరమైన విషయములు సంగ్రహముగా ఇందు వ్రాయబడియెను.

గద్య

ఆపస్తంభసూత్ర, కౌశికసగోత్రపవిత్ర, తత్వవిద్యావిశారద దేవులపల్లి
అచ్చన్నశాస్త్రి పౌత్ర, జ్యోతిష మంత్ర వైద్య, తత్వ విద్యావిశా
రద సరససంగీత సాహిత్య విభవ, వేంకట సుబ్బరాయ శాస్త్రి
సుపుత్ర, శ్రీగోపాలకృష్ణ కరుణాకటాక్షవీక్షా విమలీకృత,
సరససంగీత, రసాభినయ శాస్త్రపాండిత్య విశేషవైభవ
విద్వజ్జన విధేయ, వీరరాఘవమూర్తిశాస్త్రి నామ
ధేయప్రణీతంబైన అభినయస్వయంబోధిని రెండ
వభాగమున అభినయముఖ్యముచేసిన, స్వర
జతులుపదవర్ణములుక్షేత్రయపదములు
హస్తాది దృష్టిభేదంబులుగల నా
లుగు అధ్యాయములు
సర్వము
సంపూర్ణము.
మంగళమస్తు.

## శుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 2 | లక్షము | లక్ష్యము. |
| 4 | 21 | అతిశయును | అతిశయమును. |
| 7 | 16 | ఇష్టాజ్ఞానముచేత నైనా కలుగును. | ఇష్టాజ్ఞానముచేతనైన అనిష్టాజ్ఞానముచేతనైనా కలుగును. |
| 9 | 9 | శాత్వికబావం | సాత్వికభావం. |
| 12 | 12 | గలుగుట | గలుగకుండుట |
| 17 | 5 | స్థితి | సిద్ధి. |
| 21 | 8 | ఖేదము | ఖేదము. |
| 21 | 14 | వివిఃలన | వీవివలన. |
| 22 | 21 | మద్యమము | మద్యము. |
| 31 | 25 | కల్పసలు | కల్పనలు. |
| 36 | 5 | వండ్లు | పండ్లు. |
| 36 | 24 | గానీ | గ్లాని. |
| 40 | 19 | ికశిచింన | వికశించిన |
| 42 | 8 | విభవాను | విభావాను. |
| 43 | 3 | గాని | గ్లాని. |
| 43 | 6 | సృతి | స్మృతి. |
| 43 | 20 | విభవానుభావ. | విభావానుభావ. |
| 44 | 4 | స్మతి | స్మృతి. |
| 44 | 14 | విభవానుభావ | విభావానుభావ. |
| 47 | 6 | జగనీశు | జగదీశు |
| 47 | 16 | సచారులై | సంచారులై |
| 48 | 2 | వల్లభ | వల్లభి |
| 49 | 19 | కార్మము | కార్యము. |
| 52 | 17 | యసను | యవస్థను. |
| 55 | 13 | నలకరింముకొని | నలంకరింముకొని. |
| 65 | 7 | చిన్నబిలముమ | బిన్నబిలముమి. |
| 71 | 5 | దానివలుకులు | దానిపలుకులు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 71 | 9 | ఎగరవేయు | ఎగరవేయుచు. |
| 73 | 15 | దూతికి | దూతిని. |
| 74 | 17 | నేరదయ | నెరదయ. |
| 76 | 14 | కనికమున | కనికరమున. |
| 79 | 9 | ఛళిరఛళిర | ఛళిఛళిర. |
| 83 | 8 | వగవగవీలల్ | వగవగలీలల్ |
| 85 | 2 | శృంగార | శృంగారరసము. |
| 88 | 18 | ఝుమ్మ్మనగ | ఝుమ్మనగ. |
| 89 | 13 | బిలచినా | బిలచిశాలినవు |
| 89 | 13 | యేలరా | ఏలరా. |
| 91 | 1 | సమశరము | సుమశరము. |
| 91 | 4 | విడుగుచు | విడుచు. |
| 92 | 18 | రాగాచంద్రుడు | రాకాచంద్రుడు. |
| 96 | 14 | వెడపై | లెదపై |
| 97 | 7 | డేడబాసి | డెడబాసి. |
| 102 | 7 | కించునీకైన | కించుకైన. |
| 105 | 21 | చక్కర | చక్కెర. |
| 107 | 13 | గంధులు | గంధములు. |
| 110 | 1 | క్షేత్రి | క్షేత్రియ. |
| 111 | 16 | నిన్ని | నిన్ను |
| 114 | 18 | యిదర | యిద్దర |
| 118 | 20 | మెట్లన్నదో | మెట్లున్నదో |
| 120 | 6 | బలద్విరోధి | బలవద్విరోధి. |
| 128 | 1 | రాకుపొమ్మంటినే | రాకుపోపొమ్మంటినే. |
| 128 | 22 | జాడగ | జాడగలమా. |
| 129 | 14 | కెవ్వరితర | కెవ్వరితరమో. |
| 134 | 4 | నర్లని | నల్లని. |
| 134 | 16 | బాలమువ్వ | బాలగోమువ్వ. |
| 137 | 22 | చిరతోడ | చిరుతోడ. |



| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 141 | 5 | నలపాంథ | గలపాంథ. |
| 148 | 22 | ఒనాతీ | ఓనాతీ. |
| 163 | 5 | నేగాన | నేగానుర. |
| 167 | 22 | వేడక | వేడుక. |
| 173 | 15 | నీమేనల | నీమేనల్ల. |
| 174 | 11 | మిరించని | మించిన. |
| 179 | 6 | చల్లనాయెలెరా | చల్లనాయెలేరా. |
| 187 | 1 | నామోలి | నామోవి. |
| 189 | 13 | బోనవిబల్లి | బోనవిబల్కి. |
| 194 | 1 | ఏగా | ఏరాముమువ్వగోపాల సామి |
| 197 | 16 | యింటిగట్టు | యింటిగుట్టు. |
| 203 | 8 | వన్నెకాడనాడ | వన్నెకాడనా. |
| 209 | 1 | విల్లుకాని | విలుకాని. |
| 209 | 15 | వల్లశివలనైతే | వలసివల్లనైతే. |
| 216 | 20 | యొదపైన | యొరపైన. |
| 222 | 17 | పర్యోడ | పర్యోద. |
| 225 | 21 | నసిన | యొసవిన. |
| 228 | 23 | యేటిసద్ది | యేటినుద్ది. |
| 231 | 5 | వాడేల | వాడేల. |
| 234 | 15 | నరగించి | గరగించి. |
| 239 | 4 | దూపకురు | దూరీకురు. |
| 239 | 8 | భరేణం | భరేణ. |
| 240 | 3 | శారదసా | శారద. |
| 264 | 11 | గడలించుట | గదలించుట. |
| 264 | 20 | చాపు | చూపు. |
| 289 | 10 | కుచేర | కుభేర. |
| 289 | 12 | కుచేర | డిటూ. |
| 292 | 22 | స్వరము | సర్వము. |

——o——

